ఈ సంపుటిలో :

# భోగిరలోయ



పగపట్టిన పన్నగిలా ఆ లోయలోనికి చొచ్చుక పొయ్యాను.

[ ప్రతివంకరకూ ప్రత్యక్షమైన ప్రకృతి దృశ్యసౌందర్యం మహాకావ్యం లో పుటలు తిప్పినప్పటి రసానుభూతిలా గున్నది.]

నాలుగు మెలికలు. ఒక్కొక్క మెలిక మూడువందల ధనువులు. అర్ధానుస్వారరూపమై ఎప్పటికప్పుడు ఆఖరులా తోచిన ఆ మెలికలో రెండువైపులా నదీదేవత సంతరించిన నలభై నిలువుల ఎత్తు నల్లరాతిగోడలు. చెట్లు దట్టంగా పెరిగిన కొండచరియలు, వాటిపై నీలాలశిఖరాలు, కారు దున్నల్లా, భయంకరమైన ఖడ్గమృగాలల్లా పడివున్న నల్ల రాతిబండల్లో ముప్పైధనువుల వెడల్పున రాగమాలికలు పాడుకుంటూ భోగీర ప్రవహిస్తున్నది.

పారిజాతవనాలు, అడవిమల్లెలు, ఇప్పచెట్లు, చీకటి మానులు, నల్లమద్దులు, రేగులు ఆ కొండచరియలనిండా ఉన్నవి.

దూరాన్నుంచి ఘంటానాదాలు, భిక్షుల మంత్ర స్వనాలు తుమ్మెదల ఝుంకారాలతో, పక్షుల కలకూజితాలతో కలిసి వినవస్తూన్నవి.

విహారానికి వచ్చిన మృగినై ఆ లోయ చొచ్చుకు పోతిని. మా వాళ్లు వెనకనే నెమ్మదిగా వస్తూ ఉండిరి. "అమ్మాయీ! ఒంటరిగా ముందు వెళ్ళి పోకమ్మా!" అని మా అమ్మ అన్నమాట ఎక్కడో దూరాన్ని వినబడింది. ఒక మలుపు మళ్లింది. ఎట్టయెదుట దివ్యదర్శనం.

భోగీర ఉత్తరవాహిని అయిన అర్ధచంద్రాకారంలో నదికి ఇరవై ధనువులయెత్తున రూపెత్తిన మంత్రప్రదర్శనంలా గుహలు, చైత్యాలు, విహారాలు ఒక శిల్పమాలిక, దూరాన్నుంచి కళ్లల్లో ఇంద్రధనువులాడుతూన్నవి. స్తంభాల శిల్పవిన్నాణము, చిత్రకౌశలం, విగ్రహాల సుసౌష్ఠవమూర్తిత్వము, ఆహారే! భిక్షుల కౌశేయ కాశ్మీర కుసుమవర్ణ వికాసము, విద్యార్థుల ధవళవర్ణ ధౌతవిలాసము, నాగరుల జానపదుల వివిధవర్ణ వినీత విచిత్రత్వము—ఒక్క పెద్దచిత్రంలా ప్రత్యక్షమైంది.

కళ్లు మూసుకొని తథాగతుని ధ్యానించుకొన్నాను. భోగీరాశ్రమ మహాపరిషత్తు సంఘారామానికి హృదయంలో చేయెత్తి జోహారు లర్పించుకొన్నాను.

నీళ్ళకు నదిలోకి దిగేవాళ్లు, రంగురంగుల కలశాలను భుజాలమీద అలంకరించుకొని మెట్లెక్కేవాళ్లు, యోషలు, పురుషులు, బాలికలు, భిక్షులు; ఒకసారి భావాలు హృద

యాన్ని నింపి వేస్తుండగా, ఒకసారి భావాలు లేని చైతన్య రహిత హృదయం కలదాన్ని అవుతూ ఆగిపోతిని. పై నుండి విద్యార్థులు, భిక్షుకులు నా కేసి తేరిపార చూస్తున్నది నేను గమనించనే లేదు. ఆ ప్రథమదర్శన ముహూర్తము పరమ పూజ్యమైంది.

ఆ పవిత్ర ప్రదేశంలో అడుగుపెట్టి అపశ్రుతి ప్రమోయించ లేదు గదా నేను? ఏదో సిగ్గు అలుముకుపోయింది.

మా గురువులు శిల్పార్ణవులు. ఆయన మోము హిమాలయశిఖరం లా శాంతిపూరితమైంది. ఆయన సాధారణంగా మాట్లాడరు. అనే నాలుగుముక్కలూ సూక్తాలై, సూత్రాలై ప్రత్యక్ష మవుతూ ఉంటవి.

చిన్నతనాన్నుంచీ చిత్రలేఖనాది కళలంటే చెలిమి కత్తెల్లా ఆడుకొంటూ ఉన్న నన్ను ఆ ఉత్కృష్ట విద్యలో సంపూర్ణ యోగనిష్ఠాపరిపూర్ణను చేయడానికై మాళవ మహారాజ్యభార ధౌరంధర్యులైన మాతండ్రిగారు, మహామంత్రులు ఆనందవసువులవారు నన్ను ఈ ఆశ్రమానికి ఒక్క పవిత్రముహూర్తాన పంపించినారు. మా కుటుంబం అంతా వచ్చి మా నాయనగారు ఇదివరకే నిర్మించిన గుహా చైత్యాన్ని అలంకరింపించ ఆజ్ఞ యిచ్చినారు. అలంకారాది కాలన్నీ పూర్తికాగానే మహోత్సవంతో ఆశ్రమాచార్యులకు సమర్పించాలని మా నాన్నగారి సంకల్పము.

ఆ గుహా విహారానికి ప్రాంగణమంటపము పూర్తి అయ్యింది. స్తంభాలు, శిల్పాలు, విగ్రహాలు, భిఖ్ఖులు

దూరాన్నుంచి ఘంటానాదాలు, భిక్కుల మంత్ర స్వనాలు తుమ్మెదల ఝుంకారాలతో, పక్షుల కలకూజితాలతో కలిసి వినవస్తూన్నవి.

విహారానికి వచ్చిన మృగినై ఆ లోయ చొచ్చుకుపోతిని. మా వాండ్లు వెనకనే నెమ్మదిగా వస్తూ ఉండిరి. "అమ్మాయీ! ఒంటరిగా ముందు వెళ్ళి పోకమ్మా!" అని మా అమ్మ అన్నమాట ఎక్కడో దూరాన్ని వినబడింది. ఒక మలుపు మళ్లింది. ఎట్టయెదుట దివ్యదర్శనం.

భాగీర ఉత్తరవాహిని అయిన అర్ధచంద్రాకారంలో నదికి ఇరవై ధనువులయెత్తున రూపెత్తిన మంత్రప్రదర్శనంలా గుహాలు, చైత్యాలు, విహారాలు ఒక శిల్పమాలిక, దూరాన్నుంచి కళ్లల్లో ఇంద్రధనువులాడుతూన్నవి. స్తంభాల శిల్పవిన్నాణము, చిత్రకౌశలం, విగ్రహాల సుసౌష్ఠవమూర్తిత్వము, ఆహారే! భిక్కుల కౌశేయ కాశ్మీర కుసుమవర్ణ వికాసము, విద్యార్థుల ధవళవర్ణ ధౌతవిలాసము, నాగరుల జానపదుల వివిధవర్ణ వినీత విచిత్రత్వము—ఒక్క పెద్దచిత్రంలా ప్రత్యక్షమైంది.

కళ్లు మూసుకొని తథాగతుని ధ్యానించుకొన్నాను. భాగీరాశ్రమ మహాపరిషత్తు సంఘారామానికి హృదయంలో చేయెత్తి జోహారు లర్పించుకొన్నాను.

నీళ్ళకు నదిలోకి దిగేవాళ్లు, రంగురంగుల కలశాలను భుజాలమీద అలంకరించుకొని మెట్లెక్కేవాళ్లు, యోషలు, పురుషులు, బాలికలు, భిక్కులు; ఒకసారి భావాలు హృద

యాన్ని నింపి వేస్తుండగా, ఒకసారి భావాలు లేని చైతన్య రహిత హృదయం కలదాన్ని అవుతూ ఆగిపోతిని. పై నుండి విద్యార్థులు, భిక్షుకులు నా కేసి తేరిపార చూస్తున్నది నేను గమనించనే లేదు. ఆ ప్రథమదర్శన ముహూర్తము పరమ పూజ్యమైంది.

ఆ పవిత్రప్రదేశంలో అడుగుపెట్టి అపశ్రుతి ప్రమోయించలేదు గదా నేను? ఏదో సిగ్గు అలుముకుపోయింది.

మా గురువులు శిల్పార్ణవులు. ఆయనమోము హిమాలయశిఖరం లా శాంతిపూరితమైంది. ఆయన సాధారణంగా మాట్లాడరు. అనే నాలుగుముక్కలూ సూక్తాలై, సూత్రాలై ప్రత్యక్ష మవుతూ ఉంటవి.

చిన్నతనాన్నుంచీ చిత్రలేఖనాది కళలంటే చెలిమికత్తెల్లా ఆడుకొంటూ ఉన్న నన్ను ఆ ఉత్కృష్ట విద్యలో సంపూర్ణ యోగనిష్ఠాపరిపూర్ణను చేయడానికై మాళవ మహారాజ్యభార ధౌరంధర్యులైన మాతండ్రిగారు, మహామంత్రులు ఆనందవసువులవారు నన్ను ఈ ఆశ్రమానికి ఒక్క పవిత్రముహూర్తాన పంపించినారు. మా కుటుంబం అంతా వచ్చి మా నాయనగారు ఇదివరకే నిర్మించిన గుహా చైత్యాన్ని అలంకరింపించ ఆజ్ఞ యిచ్చినారు. అలంకారాది కాలన్నీ పూర్తికాగానే మహోత్సవంతో ఆశ్రమాచార్యులకు సమర్పించాలని మా నాన్నగారి సంకల్పము.

ఆ గుహా విహారానికి ప్రాంగణమంటపము పూర్తి అయ్యింది. స్తంభాలు, శిల్పాలు, విగ్రహాలు, భిక్కులు

నివసించడానికి లోనిగదులు, శిలాతల్పాలు, ద్వారశిల్పాలం కారాలు, గర్భగృహాశిల్పాలు, తధాగత గంభీర శిల్ప మూర్తి, ఆసనము, ఛత్రము, తోరణాలు, ధర్మచక్రము – అన్నీ పూర్తిఅయ్యాయి. వివిధదేశాలనుంచి శిల్పము, చిత్ర లేఖనము నేర్చుకోవచ్చిన శిష్యులు, పనివాండ్రు చిత్రలేఖనా లంకారము పూర్తి చేస్తున్నారు.

మహాశిల్పి, చిత్రభవన నిర్మాణ కళాకౌశలి మా గురువులున్నూ తమ శిష్యులతోపాటు మధ్యమండప మంతా జాతకగాథలు, అలంకారచిత్రములు వేస్తున్నారు.

ఒకచోట ఒకశిష్యుడు చిత్రకల్పనచేసి గురువులకు చూపిస్తున్నాడు. గురువులు దానిని సవరించి వేయవలసిన వర్ణాలు చెప్పి వేరొక చోటకు వెళ్తారు. వర్ణాలు పూర్తిచేసి వేరొకశిష్యుడు నివేదిస్తాడు. గురువులు రంగుల పాత్రలలో తూలికలు ముంచి చిత్రంలో తప్పు దిద్దుతున్నారు. గురువులే వేరొకచోట రూపకల్పన కల్పించి నలువురు శిష్యులచే వర్ణాలు నింపించుతున్నారు. చిత్రకల్పన, రూపసృష్టి వర్ణికా పూర్ణము అంతా మా గురువులే కొన్ని చోట్ల సంకల్పించి అద్భుతభావాత్మక కళావైదగ్ధ్యము ప్రత్యక్షముచేస్తున్నారు. దినముదినమూ ఆ విచిత్రోత్సవము సందర్శిస్తూ గుండెలు నృత్యాలుసల్ప ముగ్ధనైపోతూ ఉంటిని. నా కళ్లు అరమూతలు పడినై; నా యవ్వనము పొంగి దిశలంటినది. నా అంగుళులు విధాతృసృజనా భావాలై కల్పనకై యోగనిష్ఠ వహింప ఉన్ముఖాలైనవి.

ఆజ్ఞకై గురువుల కడ మోకరిల్లినాను.

౨

ఎవరో బాలిక నా యెదుట మోకరించింది. ఆ మూర్తి వస్తూఉన్నదని గ్రహించడం తోనే కన్నులు చటుక్కున మూసుకున్నాను.

"ఎవ రీ మె?"

ఆమెతో కూడా వచ్చిన ఒక వృద్ధ—

"స్వామీ, ఈ బాలిక మాళవప్రభుని మేనమరదుల వారున్ను, మాళవదేశానికి ముఖ్యమంత్రులున్ను అయిన ఆనందవసువులవారి ఏకతనయ. చిన్నతనాన్నుంచీ చిత్ర లేఖనములో మంచి చాతుర్య మలవరచుకొన్నది. ఐనా ఆమె శక్తికి తగిన గురువులు లభించకపోవటంచేత విద్య వృద్ధిపొందినది కాదు. జినదేవుని ధర్మప్రచారం లా, తమ కీర్తినీ లోకాల్ని ఆవరిస్తూ వుండటం చేత తమ పాదసన్నిధిని శుశ్రూష చేయటానికని మా అమ్మాయిగారు వచ్చారు. చిత్ర విద్య ద్వారా నిర్వాణ మార్గాన్న న్వేషించటానికి మా అమ్మాయిగారికి దీక్ష యివ్వవలసినదని ఆనందవసువుల వారున్నూ, మేమున్నూ ప్రార్థిస్తున్నాము."

"ఎవరయ్యా, అక్కడ? ఈ పిశాచాలని నాదగ్గర కెవరయ్యా వదిలిపెట్టింది? గురుద్రోహం తలపెట్టిన పాపాత్మ

లైన శిష్యు లెవరయ్యా వారు?" అని పెద్ద గొంతుకతో అరచినాను.

ఆ వృద్ధ అంతట "అమ్మాయిగారు! వెండిపోదాము" అనుచుండ, నేను చెంగున ఆమె పైనుండి దాటి ఏదో గొణుగు కొంటూ వెళ్ళిపోయినాను. వాఘీరాశ్రమ సంఘాచార్యులైన సత్యశీల భిక్షాచార్యుల కడకు చేరుకొన్నాను. సత్యశీలా చార్యులు నూరేండ్ల వృద్ధు. సర్వశాస్త్ర సంపన్నుడు. ఇంతైనా వీడిపోని శక్తిసంపన్నుడైన ఆ మహాత్ముడు నన్ను ప్రక్కనున్న కుశాసనముపైన అధివసింపజేసి, "తండ్రీ! ఏమంత తొందరపాటుతో వస్తున్నావు?" అని ప్రశ్నించాడు.

పవిత్రులైన ఆచార్యుల వారి పాదాలకు నమస్కరించి "భయంకరమైన ఒక విషయాన్ని తమకు చెప్పదలచు కొన్నాను. ఈ ఆశ్రమానికి ప్రథమంలో నేను వచ్చినప్పుడు నాకు రెండవ జీవితంలాంటి ఆశయాల్ని కొన్నిటిని తమతో మనవిచేసి, తమ ఆజ్ఞతో పరమశ్రమణకుడు నాకు ప్రసా దించిన ఈ నా కొద్దివిద్యను సంఘానికీ, లోకానికీ అర్పించా లని ఈ సంఘారామం ప్రవేశించాను."

"అవును, ఆ ఆశయాలకు భంగం యేమి వచ్చింది తండ్రీ ?"

"ఒక బాలికకు నేను చిత్రవిద్య నేర్పాలట, స్వామీ!"

"మాళవ మహామంత్రి ఆనందవసువు పాప మెరగని తన కుమార్తెకు నీచేత విద్య నేర్పించాలని ఆశించి తథా గతుని పాదంపైమోల ఆశ్రయిస్తున్నాడు, బాబూ!"

"నా నియమానికి వ్యతిరేకం గదా, ఆచార్యదేవా!"

"అంత కఠిననియమ మెందుకు పూనావో నేను తెలుసుకోడానికి ప్రయత్నంచేయలేదు. నిన్నూ అడగలేదు. పురుషునికి బద్ధశత్రువు కాదగిన అవమానం స్త్రీ యేమి చెయ్యగలదు, తండ్రీ? పురుషుని ఉత్తమశక్తిని పైకి విజృంభింప చేయడానికి స్త్రీయున్నూ, స్త్రీయొక్క పవిత్రశక్తిని తేజరిల్ల జేయడానికి పురుషుడున్నూ వుద్భవించారు. పవిత్రులయిన నాగార్జునాచార్యులవారి ఉపదేశం అట్టిదే; తథాగతుని పవిత్ర ధర్మమూ అదే!"

"అలాగయితే భిక్షుక, భిక్షుణీ దీక్షలెందుకు గురుదేవా?"

"ఓయి వెఱ్ఱివాడా! దీక్షలేనిదే నిర్వాణమార్గం యెట్లా అన్వేషిస్తావు? ప్రాపంచిక దూరుడవై ప్రాపంచికాతీతమైన ధర్మాన్ని అన్వేషించాలి. ఆ దీక్షలో, ఆ తపస్సులో స్త్రీ పురుష లోకళ్ళకోకళ్లు అడ్డం రాకూడదు; అంటే, స్త్రీపై పురుషునికి వాంఛా, పురుషునిపై స్త్రీకి వాంఛా పోవాలి. అంతవరకు ప్రపంచంలో వుండి జినభక్తులై ధర్మమార్గావలంబకులై చివరకు ప్రపంచం వీడి నిర్వాణార్థులు కావాలి."

"ప్రభూ! నాగార్జునాచార్యదేవులు నివసించిన పవిత్ర సంఘారామం వున్న శ్రీపర్వతపురం కృష్ణాతీరాన్న వున్నది."

"అవును, ధాన్యకటక నగరానికి యెగువను",

"అక్కడ ఒక శిల్పి ఆంధ్రబ్రాహ్మణ యువకుడు వుండేవాడు. అతడు సాంఖ్యాయాన సగోత్రుడు. ఇక్ష్వాకు మహాప్రభువుల ఆస్థాన శిల్పి."

"బౌద్ధ దీక్ష వహించినవాడా?"

"బుద్ధదేవుని విష్ణుని తొమ్మిదవ అవతారమని నమ్మిన వాడు. శిల్ప కర్మ రీత్యా మోక్షం చూరగొనా లన్న సంకల్పం కలవాడు. సౌందర్య తత్త్వోపాసి."

"బుద్ధుడే పరమావతారం. ఆతని పూర్వ అవతారా లలో ఒకటి విష్ణు అవతారం."

"ఆ శిల్పికి వసంతపుష్పాల సౌరభము, నీలాకాశము, మేఘాల నీలి అంచులు, చిరుగాలిలో పుట్టిన చిన్న కెరటాల మీద ప్రసరించి తళుకుమనే చంద్రకిరణాలు, సెలయేటి పత నాల తుంపురులు, ఇంద్రధనుస్సు అంచులు, లేడి కూనల ముట్టెలు, సుందరీమణుల అపాంగ వీక్షణాలు పులకరాలు కలుగజేసి అతన్ని శ్వేతతారాదేవి పాదాల కడ మోకరిల్ల జేసేవి."

"ఇంత నశ్వరమైన సౌందర్యాన్నా అతను ఆరా ధించినది?"

"ప్రభూ! సంఘారామంలో, రాజ ప్రాసాదాలలో అతడూ, అతని శిష్యులూ సృష్టించిన శిల్పాలూ, చిత్ర లేఖనాలూ, ఆ యా నగరాలలో ఆతడు నిర్మించిన భవ నాలూ, స్థూపాలూ లోకమోహనమై వెలిగాయి."

"పరమ దేవుడైన మహా శ్రమణకుని గొప్ప భక్తుడే."

"చిత్తం! ఆతడు ఇక్ష్వాకు రాజకుమారి నొకర్తెను ప్రేమించాడు. ఆమె అతని దివ్య ప్రేమను గౌరవించి తిరిగి ప్రేమించినట్లు అభినయించింది."

"ప్రేమించనే లేదా యేమిటి?"

"స్వామీ! ఆమె శుష్క హృదయ, వృథాడంబరం కలిగిన విచిత్రస్వరూపమైన శూన్య జీమూతం వంటిది. అతని ప్రేమ లోకాల నావరించింది. ఆమె అంతకన్న అనంతమైన ప్రేమలో ఆతన్ని ముంచివేస్తున్నట్లు నటించింది."

"ఏ మా వెట్టి ఆ బాలికకు?"

"స్వామీ! స్త్రీ హృదయం యెవ్వరు యెరుగగలరు? రాజబంధువైన ఆమె తండ్రిని ఆమె పాణిగ్రహణానికై ఆ శిల్పి యాచించాడు. తండ్రి సంతోషముతో అనుమతి యిచ్చాడు. కాని కపట నటనానటి, కర్కశహృదయమైన ఆ బాలిక 'నే నేమిటి! ఈతనిని పెండ్లి చేసికోవట మేమి'టని వెడనవ్వు నవ్వింది. ఆ శిల్పి హృదయంలో చీకటి ఆవరించు కుంది. భయంకరమైన తుఫానుమబ్బులు పట్టినవి. దావానలం అడవుల్ని మండించినప్పుడు వుద్భవించే పొగ అతని జీవితాన్ని క్రమ్మివేసింది. ఆతనికి దైవం లేదు, బుద్ధుడు లేదు, ధర్మం లేదు, ప్రేమ లేదు."

"ఎంత వెట్టివాడై పోయినాడు!"

"వెట్టివాడు కాదు స్వామీ! సర్వజ్ఞానమూ నశించి పోయిన పిచ్చివా డయిపోయినాడు. ఆతని జీవితంలోన

దుర్భర విషాదము హాలహాలమై సమస్త భువనాలూ దహించ టానికి బయలుదేరినట్లయింది. దేశాలు తిరిగి తిరిగి ఈ ఆశ్ర మానికి చేరుకొన్నాడు.''

''ఓయి వెఱ్ఱిబాలుడా! ఇంత విషాద గాథా నీది? అందుకనా స్త్రీలోకం మీద నీ కింత కోపము?''

''కోపము కాదు, భయము స్వామీ! తమ పాద సన్నిధి చేరుకుని కొంత వూరట పొంది జగద్గురువైన పరమ శ్రమణకుని అవతార మూర్తులైన మీకు నా సేవ అర్పించి భౌతిక వాసనల నుండి దూరమై నిర్వాణానికి అర్హత సంపా దించుకోటానికి దీక్ష వహించాను. నేను పూనిన ప్రతిజ్ఞలు తమకు నివేదించి శిల్పకళాదీక్షకు పూనాను. ఈ విషాద చరిత్రుణ్ణి ఒక బాలికకు గురువుకమ్మని ఆజ్ఞాపించటం నా మోక్షానికి నన్ను దూరం చేయటం అని మనవి చేసు కొంటూన్నాను.''

''బాపూ! బుద్ధదేవుని పరమ కరుణచేత అనన్యమైన మానవసేవ నాకు లభించింది. లోకాన్ని సంతరించటానికి పూనుకొన్న నాకు మానవహృదయం పూర్తిగా తెలుసును. శిల్పివైన నీ చిత్తవృత్తిలో ప్రేమ నశింపక లోతుల అణగి వున్నది నిర్వాణ పథార్థివై యున్న నీవు స్త్రీ విషయమై భయము సంపూర్ణంగా నాశనము చేసికో వలసి వుంటుంది. స్త్రీ మాయాదేవి యొక్క అంశ; ప్రజ్ఞాపరిమిత, శ్వేతతారా దేవి. ఈ బాలికకు నీవు చిత్రలేఖన విద్య నేర్పి నీ తపస్సు

పూర్తి చేసికో. భయపిశాచము నీ హృదయాన్ని ముక్కలు చేయకుండా చూచుకో !''

మేము ఒక్క విఘటికాకాలము నిశ్చలులమై, వేణు వనము అను పేరుగల ఆ మహాచైత్యంలో సంధ్యాకాలము దోరరంగుల పాకించేవరకు ధాన్యకటకపు పాలరాతి బుద్ధదేవుని విగ్రహాలల్లా కూర్చుండిపోయాము. నా హృదయంలో జడత్వ మావరించింది. దూరాలపుట్టి యోజనశతాలు ప్రవహించి, ప్రవహించి, ఒడ్డుకుచేరి విరిగిపోయే కెరటంలా నా ఆలోచనలు వికలాలు అయిపోయినవి.

3

జ్యోత్స్నా ప్రియ నాముల్లైన మా చిత్రాచార్యులు విసవిస వెళ్ళిపోవడం తోనే అక్కడ ఆగలేక పరుగిడిపోయి నాను. నా హృదయం పచ్చి మృణ్మయపాత్రలా ఛిన్నమై పోయినది. దాసీజనము ఆశ్చర్య పడుతూ వుండగా, తల్లి వెలవెలపోతూ వుండగా, విస విస నడిచి 'మాళవ మహారాజ విహార'గృహంలోనికి పరువిడిపోయి మంచముపై నాథునిచే నిరసింపబడిన ఉమాదేవి చేతిలోని పూలదండలా ఒళ్లుతప్పి పడిపోయాను.

నాకు మెలుకువ వచ్చేటప్పటికి విహారమంతా చీకటిలో వున్నది. ఎక్కడో రెండు నేతి దీపాలు మినుకు మినుకుమంటూ మిణుగురులులా వున్నవి. ఆ చీకట్లోంచి గుహ

లోని స్త్రీ పురుష చిత్రమండల మంతా నా వైపే కరుణ హాసావలోకనములతో పరిశీలిస్తున్నది. నా మంచానికి దగ్గిరగా మహాగురువు సత్యశీల భిక్షాచార్యులవారు కాలాతీత మైన స్వరూపంతో, పరమదయను ప్రసరించే వెన్నెలలు నింపే చూపులతో, ఆ ముదుసలి పెదవుల వరపూరితమైన నవ్వుల వెలిగిపోతూ వుండగా చూస్తూవున్నారు.

మత్తు నెమ్మది నెమ్మదిగా విడిపోయి బుద్ధి నిర్మలమై లోకజ్ఞానమువచ్చి చటాలున లేచి నిలుచుంటిని. పడబోయిన నన్ను మా వృద్ధదాసి పట్టుకొని "ఆచార్యులవారికి నమస్కారము చేయి తల్లీ," అని ఉపదేశించింది.

ఆ వృద్ధాచార్యుల పాదాలకడ మోకరిల్లి పోయినాను.

"అమ్మాయీ! నీ దీక్షకు చాలా సంతోషము. ఎందుకమ్మా శిల్పమంటే నీకింత మమకారము?"

"స్వామీ!......"

"ఊరడిల్లి చెప్పమ్మా, తల్లీ! తొందరలేదు."

దాసీజనము భక్తితో కొనివచ్చి అర్పించిన పీఠముపై శాంతపవిత్రులైన ఆ వృద్ధ భిక్షులు అధివసించినారు. ఆయన కడనే తలవంచి కూరుచున్నాను.

నా గొంతులో నుండి వినబడీ వినబడని స్వరము మాత్రమే ప్రవహించినది.

"స్వామీ! చిత్రకళ నేర్చికోని నాడు నా జన్మం వృథా! నా పూజ నుసి అయిపోతుంది. నే నింక తీరని

యీ గాఢపవిత్ర వాంఛను భరించనూ లేను; తోలి వేయనూ లేను.''

"అదేమిటమ్మా వెఱ్ఱిబాలికా! ఇంక నీకు చిత్రకళ నేర్పే వారే లేరా?''

నేను చటాలున లేచి కూచున్నాను. "స్వామీ! నేను అందరి చిత్రలేఖనాసామర్థ్యమూ పరిశీలించినాను. ప్రజ్ఞారహితులదగ్గిర అభ్యాసము వున్న విద్య కొంచమూ నశింప జేసుకోడానికే గదా?''

"సరే నమ్మా! జ్యోత్స్నాప్రియశిల్పాచార్యులవారిని నీకు చిత్ర విద్య నేర్పడానికి వొప్పించాను. కాని వారు కొన్ని నియమాలు కోరారు. వారు చిత్రిస్తోవుంటే వెనక నుంచి చూచి నేర్చుకోవాలట; ఎదుట బడకూడదు. వారు లేనప్పుడే గోడలపై చిత్రలేఖనము కల్పించాలట. అది వారు తర్వాత దిద్దగలరు. ఫలకాలపై రచించిన నీ చిత్రాల్ని వారికడకు సేవకులచేత పంపిస్తే వారు సరిచూడగలరు...''

"స్వామీ! ఏలాంటి నియమము శాసించినా సరే, నాకు చిత్రవిద్య ప్రసాదిస్తేచాలు. నేను ధన్యురాల్ని; నా జన్మం అంతా తరించింది.''

కులపతి సత్యశీలాచార్యులు వృద్ధత్వములోకూడా కాంతి వీడని తన కన్నులతో నవ్వుకొంటూ వెళ్ళిపోయారు.

ఈ వరము నాకేలా ప్రసాదింపబడింది! ఎంతటి అపూర్వ సంఘటన! ఈ భిక్షును, పూవు మధువును దాచు

కొని సంభావించినట్లు యెంత పూజింపగలనో ! తీగలలో స్వరాలు చేరినట్లు, వసంతంలో సౌరభాలు పొదువుకు పోయి నట్లు నాలో ఈ శిల్పవిద్య హత్తుకు పోవాలిగాక !

౪

త్వరలో శుభముహూర్తం చూసి నా కడ ఈ విచిత్రపద్ధతిని చిత్రవిద్యను అభ్యసింప దీక్ష వహించింది అబాలిక. ఆమె పేరు కల్హారమాల యట. విషాలు హృదయా లల్లో దాచుకొన్న ఈ పాపజన్మలకు, మారపిశాచి ఆయుధా లకు చక్కని పేర్లుమాత్రం పెద్దారు వెఱ్ఱివాళ్ళయిన పురుషులు. జినదేవుడు స్త్రీత్వంతో లోకాలు ఎందుకు మలినంచేశాడో! బుద్ధదేవునికి పవిత్రమైన ఆ నలభైరోజుల మహాతపస్సులో జరిగిన పరీక్ష నాకు ఎన్నిసంవత్సరాలు జరుగనుందో.

ఆ బాలిక రచించే చిత్రాలల్లో ప్రజ్ఞ ఉన్నది. వర్ణ జ్ఞానమూ బాగానే తెలుసును ఆడవాళ్లు రేఖానైపుణ్యం ఎలా సంపాదించుకోగలరు చెప్మా. ఈ చిన్నది తీరైన రేఖలు ప్రవహింపజేస్తో వుంది. ఎక్కడో తప్పువస్తూ ఉన్నది, నిజమే కొందరు విద్యార్థులు ఇన్నిసంవత్సరాలు నేర్చు కుంటూ కూడా ఇప్పటికీ రేఖాశక్తి అలవడ జేసుకో లేకుండా ఉన్నారు. ఆమె కుంచెలు ఆమే కట్టుకుంటుందిట-విచిత్రమే. అతిలలితాలైన వేళ్ళల్లో శక్తి ఉండదుకదా! ఈ బాలిక వేళ్లు పురుషునివేళ్లల్లా ఉంటవేమో. ఆ బాలికే పురుషునిలా

ఉంటుందేమో. మెరుములా వచ్చి నా దగ్గిర వాలినప్పుడు అస్పష్టంగా తోచింది నా కా మూర్తి. ఆ రూపము సుందర విగ్రహమే. ఛీ! ఈ స్త్రీనామక పిశాచిని ఎందుకు తలపోసు కొంటున్నానో.

ఆమె రచించిన చిత్రాలు సవరించడం నా కా రోజుల్లో ఎంతో హేయమైన పనై వేధించింది. నేను సృష్టింప సంకల్పించిన శిల్పాలుగాని, చిత్రాలుగాని నా హృదయం లోనే ఇంకిపోయినవి. కీలుబొమ్మలా ఏదో దిద్దేవాణ్ణి, లోలోన మన్యపుజ్వరం బాధించేవాడిలా చిక్కిపోయినానట. నెమ్మదిగా చేతులకు ఒణుకు ప్రారంభిస్తుందా అన్న భయము అంకురించింది. ముప్పదిఐదేండ్లు నడుస్తూ ఉన్న నా జవ సత్వాలు నాకు దూరమైపోతున్నవి, తప్పనిసరిగా విద్యార్థు లకు విద్యనేర్పడం ఎల్లాగో పెట్టుకున్నాను. తక్కిన కాలాలు మా విహారగుహలో అంతరకందరంలో ఆ కఠినశిలావేదికపై పండుకొని ఉండడమే తప్ప అడవులలోనికి విహారానికి వెళ్ల లేకపోయే వాడను.

ఒకరోజున కల్హారమాల రచించిన చిత్రము సవరించ డానికి మాళవమంత్రిగారి విహారానికి పోయినాను. నేను రచించిన బోధిసత్వునిప్రక్కనే ఒక బాలికామూర్తి చిత్రాన్ని చూచినాను. ఎవరు చిత్రించినారు ఆ బొమ్మను? ఎందుకు చిత్రించినారు? నా ఆజ్ఞ లేనిదే ఏ మూర్ఖుడు చిత్రించ సాహ సించాడు? ఆ విగ్రహము విస్తుపోయినట్లు నా వైపు చూస్తూ ఉన్నది: గాలి పీలుస్తున్నట్లే ఉన్నది. కొంచెము సంప్రదాయ

విరుద్ధముగా ఉన్నది. సమభంగాకృతిని త్రిభంగమూర్తి కడ కల్పించుట అపశ్రుతిభూయిష్ఠము.

ఇంతలో ఆ విగ్రహము కదిలి నెమ్మదిగా చేతులు జోడించి తలవంచుకొన్నది. అది మూర్తికల్పన కాదు; ప్రాణపూరితమైన బాలికామూర్తి. నా గుండె ముడుచుకొని పోయింది, విస్ఫారితమైపోయింది. మహావేగాన భేరీభాంకారాలు వాయించ నారంభించింది. చైతన్య రహితుడనై అట్లనే నిలుచుండిపోయాను.

ఆ సౌందర్యము అలౌకికము. ఆమెముఖాన నిశ్చలత్వము, ప్రజ్ఞాపరిమితత్వము, శాంతి, నిర్మలకోమలకాంతి, అత్యంత నిగూఢసత్యము తాండవమాడుతున్నాయి. స్త్రీ మొఖము చూడనన్న నా ప్రతిన నట్టేట సుడిగుండాలలో మునిగిపోయినది.

"నువ్వు దేవబాలికవా?" అని గబగబ ముందుకు బోయి ఆమెను ప్రశ్నించాను.

"ప్రభూ! – నేను – కల్హారమాలను – మాళవమంత్రి – కుమార్తెను——"

"నా శిష్యవా? హ, హ, హ, హ..." అని వెడ నవ్వు నవ్వుతూ చివాలున వెనక్కి తిరిగి ఆ అడవులలోకి మహావేగాన వెళ్ళిపోయినాను. నా హృదంతరాళాల కారుచీకట్లు కానట్టి, వెలుగు కానట్టి శూన్యమేదో ఆవరించుకుంది. నా ఒళ్లు కంపించింది. నేను భరించలేని భయంకరానందము

పరవళ్లు కట్టి నన్ను ముంచి, సుళ్లలో తిప్పి, అతిలోతులకు లాగి, ఎక్కడకో విసిరికొట్టింది.

భయంకర మృగాలు ఆ అడవులలో సంచరిస్తూ వుంటవనే మాట మరచిపోయి నేనే నిశాచరమైన వ్యాఘ్రము వలె ఆ చెట్ల నీడల్లో పడివుంటిని. రాత్రల్లా దూరాన తోడేళ్లు, చిరుతలు అరుస్తూ వున్న విషయమే గ్రహించ లేదు.

నాకు పెనుభూతాలు కనబడ లేదు; పాముల బుసలు వినబడ లేదు. విషపుచెట్టుయొక్క లేత ఆకు యెంత కోమల సుందరమై వున్నప్పటికీ, అది విషపూరితమే అయినట్లు, సౌందర్యం పుంజీభవించిన స్త్రీ మూర్తులన్నీ విషపూరితలే. ఈ విషయము సేవించిన్నీ దహించబడకుండా జినదేవుని కరుణ వల్ల, ఒకనాడు బయట పడ్డాను. నేను మళ్ళీ ఈ విష ప్రయోగం యే మహత్తర కారణం చేత నన్ను తాకిందో! అమిత జాగ్రత్తతో గమనిస్తూవున్న నా దీక్ష కర్కశహస్తాల పాలబడి. కటిక నేలబడిన మట్టి బొమ్మలా ముక్కలు ముక్కలై పోయింది. ప్రపంచానికి దూరంగా వుంది గదా అని ఈ సంఘారామానికి చేరాను. ప్రపంచమే తరుముకుని తరుముకుని, ఇందుణ్ణి తరుముకు వెళ్లిన బ్రహ్మహత్యా పాతకంలా, నన్ను వెంబడించింది. ఏనాటి ప్రారబ్ధ మిది?"

ఆ బాలిక యెంత నిర్మల చరిత్రం నటిస్తూన్నది! అతి నిర్మలమైన నీళ్లు కలిగిన కాసారం లాంటి హృదయం కలిగిన

మనిషిలా వుంది. ఆమె దివ్య సౌందర్యాన్ని రసపూర్ణమైన కళాస్వరూపం లోనికి దింపటానికి సమయాలు పాటింప నవసరం లేని దివ్యచిత్రమూర్తిత్వంలా వున్నది. ఇంత అందము విషపూరితమై వుండగలదా? ఆ ఇక్ష్వాకు బాలిక మాత్రం సౌందర్యవతి కాదా? చలించిన ఈ నా మనస్సును కట్టివేయటానికి తపస్సులో నా మనస్సును పవిత్రం చేసికోవాలి.

ఇంతట్లో తూర్పు దెసను వెల్గుజీరలు సాగినవి. ఏలాగో ఆశ్రమానికి చేరుకొన్నాను. ఈ బాలికకు యింక విద్య చెప్పకుండా వుండడానికి వీలులేదు. సత్యశీలాచార్యులవారి ఆజ్ఞ అనుల్లంఘనీయము. ఈ దివ్యవృద్ధుడు తన ఆజ్ఞతో నన్ను కట్టివేసినాడు. ఆ బాలికకు చదువు చెప్పమని నన్ను వొప్పించే సందర్భంలో యేవో విచిత్రమైన—భావగర్భిత మైన మాటలన్నారు. ఆయన మాట లమోఘములు: సత్య స్వరూపములు. ఇప్పుడు జరిగిన దంతా వారికి నివేదించి వారి యాదేశానుసారంగా నడుచుకోవటమే నా ధర్మం అని నిశ్చ యించు కొన్నాను.

దర్శించిన మరుక్షణంలో సత్యశీల భిక్షాచార్యులవారు చిరునవ్వు నవ్వుతూ నన్ను కూ ర్చు ం డ మ ని సైగచేసి, 'నాయనా! నీలో శుభపరిణతి ఆసన్నమయ్యే ధర్మసమయం వచ్చింది. నీ సంఘసేవ సంపూర్ణత తాల్చాలి...'

"స్వామీ! నేను అవమానం పొందటమే ధర్మసేవా? వేళాకోళమే ఎరగని తమ మాట యీ రోజున యీలాగున

చిరునవ్వులతో నిండియున్న దేమి? అది నా కర్మ మనుకొని నేను వూరడిలాలి గాక !"

"ఓయీ! సౌందర్యతత్త్వోపాసీ ! నీ చిత్రలేఖన విద్యలో ఒక్క చిన్న దోషమున్నదని నీవు గ్రహించలేదు? కరుణ నీ విగ్రహాలల్లో మూర్తించలేదు. సంప్రదాయ జనితాలై, మూర్తిలో-రూపకల్పనలో ఏ మాత్రమూ లోటు లేని చిత్రాలను యెన్ని కల్పించినా, వాటిలో కరుణ తొణి కిసలాడటం లేదు. తండ్రీ! కరుణ నశించిపోయిన మరుభూమి యైన నీ ప్రజ్ఞ "ఏకోరసః కరుణఏవ" అనే మాట మరచి పోయింది. నీ బోధిసత్త్వుల చూపుల్లో కర్కశత్వం వున్నది. యోగం వున్నది. బుద్ధుడు పరమకరుణామూర్తి తండ్రీ ! అహింసాపూర్ణావతారము. చేతిముద్రలలో, భంగిమాలలో, వివిధస్వరూపములైన దృష్టులలో సంపూర్ణసత్యమైన దివ్య త్వం లేదు. ప్రాపంచికరూపమైన దివ్యత్వమే కరుణ. ఈ ముక్కలు నే నన్నానని విషాదపడకు. కొంతవడిన నీ పూజ పరిపూర్తి చెందవద్దా !"

మరిన్ని కలవరంలోపడి మా విహారం యెలాగో చేరు కొని అక్కడ దివ్యభిక్షుని విగ్రహం మ్రోల నా తల వాల్చి కాంతికై యాచించాను. ఘటికలు జరిగిపోయినవి. వరములా నా మార్గము నాకు ప్రత్యక్షమైంది. "నా బొమ్మలలో కర్కశత్వ మున్నదా, ప్రభూ? ఇన్ని సంవత్సరాలూ నా తపస్సులో చంద్రగ్రహణంలా అసంపూర్ణత్వం వరించుకొనే వుందా ?"

"నీ నియమాలని భగవంతుని కర్పించి మానవ శీల మందు విశ్వాసంతో చిత్రకళాదీక్ష నెరపవయ్యా" అని నాకు పరమగురుని ఆదేశం వినబడి నట్లయింది.

౨

నన్ను చూస్తూనే మా గురుదేవులు, తాను తా గానట్లు "నువ్వు దేవబాలికవా?" అని ప్రశ్నించినప్పుడు యేదో నిర్వచింపజాలని ఆనందంతో వొణికిపొయ్యాను. సామాన్యమైన మూర్తైనా అసన్యమైన యేదో వెలుగుతో మహాసౌందర్య మూర్తిలా తోస్తారు. ఉత్తమ శిల్పమూర్తి లక్షణాలు ఆయనలో కొరతపడినా కొరత పడినట్లే వుండవు. ఆ రావడం వచ్చి నా బుజాలు చేతులతో అదిమిపట్టి ఇటు అటు వూపి, 'ఏల ఈ తప్పిదం చేశా'వని నన్ను శిక్షిస్తే, నా జన్మ పవిత్రమైంగని వూహించుకొనేదాన్ని. ఆ క్షణంలో ఆయన దివ్యుడే అయిపోయినాడు. ఆయన వేపు న న్నేదో విచిత్ర శక్తి ఆకర్షణ చేసింది. ఇంతలో ఆయన మటు మాయమై పోయినాడు. నా తప్పిదానికి నివృత్తి వున్నదా? ఈ సత్పురుషుని తపస్సు భంగం చేయటాని కుద్భవించిన పాపినా నేను? పవిత్రమైన ఆయన నియమానికి భంగం చేశాను తత్ఫలితంగా, ఏ నియమాలూ లేకుండా చిత్రవిద్య నేర్చుకోనటాని కందరూ రావచ్చునని ఆయన ప్రకటన చేశారు.

ఆ మరునాటి నుంచీ ఆయన నన్ను తన కడకే పిలి పించుకొని చిత్రవిద్యలోని రహస్యాలు మహా గాంధర్వంలా ఉపదేశించ మొదలుపెట్టారు. ఆయన రూపమే మారి పోయింది. ఏదో వింత శక్తి చేత అలుముకుపోయినారు. కొద్ది మాటలతో మాత్రమే వినేవాళ్ళ తృప్తిని తీర్చే ఆయన ఆ నాటి నుంచీ ఝరీవేగంతో, తియ్యని గొంతుకతో ఘటికలు ఘటికలు మాట్లాడేవారు. ఎందుకో? ఏవేవో ప్రశ్నలు నాపై వర్షము కురిపించే వారు. ఆ రోజుల్లో నాకు కలిగిన ఆనందాన్ని వర్ణించలేను. ఆయన కడ సంతతము వుండ బుద్ధి. ఆయన పాదాంగుళులను పువ్వుల మొగ్గలను ముట్టినట్లు ముట్టి కళ్ళ కద్దుకోటానికి కాంక్ష. ఉన్నట్లుండి నా కేదో వివశత్వం!

"కల్హారమాలికా! ఈ చిత్రవిద్య పూర్తియైన ఆ వెనక నీ వేమి చేయదలచుకొన్నావు?"

"బుద్ధదేవుని చరిత్ర రచించుకొంటూ నా జీవితం పవిత్రం చేసుకోవాలన్న కోరికే నన్ను కదిల్చి వేస్తోంటుంది. అంతకన్న నా మొరకు హృదయాని కేమీ తోచదు."

"మానవుల్లోని దివ్యత్వమే కళాస్వరూపమై వెలువడు తుంటుంది. నిశ్చయమే. కాని వివాహమైన వెనక నీ దీక్ష యెట్లా సాగుతుంది కుమారీ?"

"ప్రభూ! నేను వివాహమే చేసుకోను."

"అది అసంభవము. మీ తండ్రిగారే రాజన్యునికో నిన్ను నివేదిస్తారు. నీవు మహారాణివి కావలసిన యోగ మున్నపుడు ఆ యోగాని కెట్లెమరీదగలవు?"

"నా జన్మమంతా తమ పాదాల దగ్గరే విద్య నేర్చుకొంటూ శుశ్రూష చేస్తూంటాను!"

"ఓ వెఱ్ఱిపిల్లా! ఆడవాళ్ళకి సహజమైన మాయ మాటలు మరచిపోయినావు కావు."

మా గురుదేవుని మాటలకు నా మనస్సు వికలమైపోయింది. నావి మాయమాట లేలాగు? నా సర్వస్వము గురుదేవుని పాదాలకడ సమర్పించటానికి సిద్ధంగా లేనా?

మా గుహాలో మా గురుదేవును రచించిన బోధిసత్త్వుని ప్రక్క ఆయన దేవేరిని రచింప సంకల్పించాను. ఆ చిత్రము పూర్తి అయిన వెనుక అది దివ్య భావపూరితము, చిత్రకళకు దివ్యమణి వంటిది అని గురుదేవులు, తోటి శిష్యులు రసజ్ఞులు మెచ్చుకుంటూ వుంటే నాకు సిగ్గువేసింది.

మా గురుదేవులను ఒక్క నిమేషమాత్రము విడిచి వుండలేక పోయేదాన్ని. ఆయన నిజంగా జ్యోత్స్నాప్రియులే. ఆయన గుహాకుపోయి శయ్యాదు లమరించడం యెంత సంతోష దాయకమై వుండేది!

ఆయన కళ్ళల్లో ఒకొక్కప్పుడు జ్యోత్స్నలే ఆడేవి. ఒకొక్కప్పుడు ఆయన చూపులు మబ్బుపొదివిన నెలబాలుని కిరణాలై మరుగుపడేవి. ఆయన యేదేని కారణాంతరాన నాకు వుపదేశిస్తూ నన్ను ముట్టినప్పుడు నా సర్వ రూపమూ కరిగి సుళ్లుచుట్టేది. ఆలాంటి దివ్యక్షణాలలో ఆయనా, నేనే-లోకాల హృదయం మధ్య.

## ౬

ఈ బాలికాహృదయతత్వం నాకు అర్థంకాలేదు. ఈమె జీవితమే నాకు కొత్త అయినది. ఈమె తక్కిన స్త్రీల కన్న వేరా? ఇక్ష్వాకురాజవంశజ అయిన ఆనాటి ఆ బాలిక అందము ఆడుపులి అందము. ఇది వెన్నెల రేఖ, వెన్నెల లోని శిరీషకుసుమము. పాల పెల్లువ తరగ, ఈమె అందంలో యేమి వంక వున్నది? నిజముగా ఈమె హృదయం పవిత్ర మైనది. ఓహో ! కల్హారమాలికయా ఈమె ?

ఈ బాలిక నన్ను విడిచి ఒక్క క్షణం వుండదు. ఆమె స్వయంగా పచనం చేసి విచిత్రరుచుల భోజనము కొనివచ్చేది. నా పాదసంవాహనం చేయ సిద్ధపడిన నాడు ఆమె నా పాదాల స్పృశించి నప్పుడు నాలో విద్యుల్లతికలు అలుముకు పోయినవి. ఆమెను నా కౌగిలిలో అదిమివేయక ఏలాగు నిగ్రహించుకోగలను ? నేను అధఃపతితుడను కావడం లేదు గదా ?

ఆమె పెదవులు జేగుర్లునిండి అతిలలితాలైన చిగుళ్లు. ఆమె కళ్లు యెంత పవిత్ర కాంతుల్ని సేకరించుకొన్నవి ! స్వచ్ఛమైన కదలికలేని చెరువు నీటిలో ప్రతిఫలించిన తారకాకాంతు లవి.

ఆమె అందము నిర్మల నీలాకాశంలో తేలిపోయే తెల్లని పక్షి. ఆమె అందము ఆ పక్షి గొంతుకలోంచి విడి పోయి ఆ నీలంలో తొణికిసలాడే పాట. ఆమె అందము

పండినపంటలోని పచ్చదనములోని పరిమళము. ఆమె అందము వెన్నెలప్రసరింపు జిడ్డుగల తీపి అయ్యో! ఆ అందం నా దేహంలో, నా హృదయంలో, నా ఆత్మలో లీనం చేసికొనక నా జన్మ వృధా.

ఆమె గుహలో ఒంటిగా చిత్రించుకునే కాలంలో ఆమెను, కల్హారమాలా దేవిని కలుసుకోడానికి వెళ్ళాను. భగవానుడా! అతికోమలమైన ఆమె జీవితాన్ని పరీక్ష చేయడానికి వెళ్ళే నేను అందమయిన రెక్కలతో పూలలో ఎగిరే సీతాకోకచిలుకను పొంచుండి కబళింపబోయే ఊసరవెల్లిలా వున్నాను. చిత్రించుకొంటూవున్న ఆ బాలిక ప్రజ్ఞా పరిమితలా వున్నది.

"ఏమిటి, నువ్వీరోజు చిత్రించుకుంటున్నది?"

"ఉన్న ఒక్క వస్త్రమూ బుద్ధదేవునికి అర్పిస్తున్న ఆ పవిత్ర చరిత్ర చిత్రము రచిస్తున్నాను."

"ఏమిటీ! నన్ను చూడనీ. ఓహో! ఎంత అద్భుత సృష్టి! బాలికా! నీ కింక శుశ్రూష అవసరము లేదు. నీ విద్య పూర్తిఅయినది."

ఈటె దెబ్బ తిన్న గువ్వలా ఆమె వణికిపోయింది.

["ప్రభూ! నన్ను మీరు ప్రేమించడంలేదా? నాకై నియమాలన్నీ వదులుకొని నన్ను ఆశ్రమపల్లి కన్న ధన్యురాల్ని చేసి ఒక్కసారిగా నన్ను అవసరములేని పుష్పంలా విసరి పారవేస్తారా?"]

"నీకు ప్రేమను గురించి ఏమి తెలుసును?"

"ప్రభూ! ఆ దివ్యవరము ప్రసాదింపబడినప్పుడు ఏమి తెలుసుకోవాలి?"

"వెఱ్ఱిదానా! చటుక్కున 'నన్ను ప్రేమించడంలేదా' అని ప్రశ్న వేశావు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?"

"వెన్నెల అంటే కలవలకు ప్రేమా? సూర్యకాంత పుష్పము సూర్యుణ్ణి కోరుతుందా? పుష్పము తేనెను కోరుతుందా? ప్రభూ! నన్ను స్వీకరించుకోండి. నేను మీ ప్రేమ భిక్ష లేనినాడు హోమం లోని నుసిని కదా!

["నేను ముప్పదియైదు ఏళ్ళ ముసలి వాడను. నువ్వు నవయౌవనంలోని పదునెనిమిదేళ్ళ మిసిమి పడుచువు."]

"ప్రేమకు ఈడుందా ప్రభూ?"

"నేను ఈ క్షణం నీ దేహాన్ని కోరితే నీ శీలం నలిపి వేసికొని నా కాంక్ష తీర్చగలవా?

"ప్రభూ! మీ ప్రేమ, మీ దివ్యప్రణయము ఆశిస్తున్నాను. నా నాశనానికి వెఱవను. మీకు అర్పణ చేసుకోవడమే నా జీవితానికి పరమమోక్షము. ఇదిగో నా మూర్తి! నన్ను మీ హృదయానికి గాఢంగా గాఢంగా అదుముకోండి. నా విద్యలు మీవి; నా కలలు మీవి; నా ఆత్మ మీది."

నా దేహం వణికిపోయింది. ఎంత పవిత్ర జీవన ప్రవాహము! ఆమెను తనివోవ బిగియార నా బాహువుల అదిమివేసి కౌగలించుకొన్నాను.

"కల్హారమాలికా! నన్ను వివాహంచేసుకోగలవా? నా ఆత్మేశ్వరీ! ఇట్టి మహదానంద సమయం కోసమేనా జీవ

దేవుడు ఆ నాడు నన్ను రక్షించినాడు. నువ్వు నా కోసమే యిన్ని సంవత్సరాలు యెదురుచూస్తూ వున్నావా? ఈ నీ దివ్యమూర్తి నాదేనా? ఈ అద్భుతమైన మోము, భారమైన ఈ తలకట్టు, ఈ దివ్యలోచనాలు, శ్వేతతారాదేవి చేతిలోని కమలాలైన నీ యీ పవిత్ర వక్షాలు, నీ యీ పరమ దేహకాంతీ—నా వేనా? నువ్వు నా దానవేనా? జినప్రభూ! నీ కరుణ యిదేనా? రా! ఆత్మేశ్వరీ, రా! మొక్కరిల్లు. పరమశ్రమణకుడే మనని ఆశీర్వదిస్తాడు!"

"ఆ ప్రభుని దాసుడ నైన నేనున్నూ మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను—దివ్యదంపతులైన మిమ్ము" అని సత్యశీలాచార్య గురుదేవులు. లేచి ఆయన కడ మొక్కరిల్లాము.

•



# నా గే టి చా లు

౧

కర్కశమైన ఆ భూమి, పొదలతో, ముళ్ళచెట్లతో, తెలియని ఓషధులతో నిండి వుంది. ఆకాశం లోకి కారు మేఘం ప్రవహించివచ్చింది గాలి లేక ఊపిరైనా ఆడని ఆ విషపూరిత వాతావరణం ఒక్కసారిగా చల్లబడిపోయింది.

ఆ నేలంతా మిట్టపల్లాలుగా వుంది. అపస్మృతి స్వర భూయిష్టమైన రాగంలో ఆ ప్రదేశం చుట్టూ దిశలు ఆవ రించుకుని వున్నాయి. పక్షుల కలకూజితా లెరుగని ఆ నేల ఆకాశంలో చల్లని గాలులను దొర్లించుకుంటూ నిండు గర్భా లలో తళతళ మెరిసే బిందుశిశువులను దాల్చుకుని వేయిమంది గర్భిణీగుర్విణులు కదలి వచ్చినట్లు శాంతంగా నీల మేఘాలు ఆవరించుకున్నాయి.

ఒక్కసారి మిన్నుల తలుపులు ఊడిపోయినవి. గంభీ రంగా తేలుకొంటూ మొయిళ్లే భూమి మీద వచ్చి ప్రాలినవి. సమీపారణ్యాలల్లోంచి నెమళ్లు వచ్చి నాట్యాలలో అలరింపు సాగించినవి. పికిలి పిట్టల గములు మేఘాలల్లో భాగాలై జన పద గీతా లాలపిస్తూ హంగులై తరలివచ్చాయి. భోరుమన్ని అఖండ వృష్టి కురిసినది.

## ౨

ఆ భూమి సౌరభావృతమైపోయింది. జల ప్రవాహాలు పరవళ్లు తొక్కుతూ ప్రవహించివచ్చాయి. చిన్నవీ, పెద్దవీ, సెలవళ్లు, వళ్లుపతనాలు, సుడిగుండాలు, ఆటలు, పాటలు, ఫేరణీ నృత్యాలు, వృత్తాత్మికా చంక్రమణాలు, ఆ నేల ఉప్పొంగిపోయింది. భూమికి దిగివచ్చిన ఆ నీలజీమూతంలో లయమైపోయింది. మబ్బులో రంగరింపై కిందికి దిగివచ్చిన ఆకాశంలో కరిగిపోయింది. నేలా నీలిమబ్బుల ఆకాశమూ ఒక్కటైపోయాయి.

ఒక్కసారిగా భూనభోంతరాళాలు పగిలేటట్లు మేఘ గర్జనములు నిండిపోయాయి. లోకమే మండిపోయినట్లు కోటి మెరుపులు తళతళలాడిపోయాయి.

మబ్బులు మాయమయ్యాయి. ఆకాశం పైకిపోయింది. ఆ భూమిపైన ఒక ఆంధ్ర మానవుడు బలిసి, కండలు తిరిగి పోతరించి, హిమాలయ శిఖరంలా ధవళాచ్ఛమై వెలిగి పోతున్న రెండు గిత్తలకు నాగలి కట్టి ఆ భూమి దున్నుతూ వున్నాడు.

ఆ మానవుని మోము ఆకాశంలా స్వచ్ఛమైవుంది. ఆ ఆంధ్రుని వదనము ఆంధ్రభూమిలా గంభీరరేఖా విలసితమై వున్నది. ఆతని విశాల ఫాలంలో వరదగోదావరి నన్నని ప్రవాహం ప్రత్యక్షమైంది. ఆతని కళ్లు సోగకళ్ళు. చిన్నచిన్న కోనేరులలో హృదయమార వికసించి పరిమళాలు వెదజల్లే

నీలి కలువలు ఆతని కళ్లు. ఆ కళ్ళల్లో కాంతులు వెల్లలు వెరుంగని దూరాలకు ప్రసరించిపోయే శక్తివంతాలైనవి. ఆ కళ్ళ కొలుకుల్లో అననుభూతమైన ఆశయాలు మిలమిల లాడుతున్నవి. తెలంగాణపు భూమివంపులా ఆతని నాసిక వక్రతతో ప్రవహించి పైకుబికి వంపు తిరిగి అతని సోగ మీసాలల్లో లయమైపోయింది. ఒకనా డాతని చేతిలో ఆయుధమైన విల్లువంటి ఆతని పెదవులు ఆంధ్ర దేశంలోని ఉదయారుణ రాగాలతో తాంబూలం సేవించుకున్నవి.

తెలుగు నేలల పండిన మామిడికాయ, ఆంధ్ర భూముల వెలసిన కోహినూరు వజ్రం ఆతని చుబుకము. తెలుగు సముద్రపు కెరటాలు పళ్ళెరాన తీసుకునివచ్చి సమర్పించిన శంఖమే ఆతని కంఠం. ఆతని బాహువులు కృష్ణా, గోదావరీ నదులు. అతని అంసలు మహేంద్ర నల్లమల పర్వతాలు. విశాలాంధ్ర భూమి ఆతని ఛాతి.

నెత్తిని కోరతలపాగా, మొలను పైకెగదోపి కట్టిన పంచకట్టు, ఆ యువకుడు యాదగిరిరెడ్డి.

## 3

ఆ వీరుని ఉత్సాహము వరహాగిరి నుంచి యాదగిరి చుట్టి కదిరివరకు ప్రత్యక్షమై వేంచేసిన నరసింహ దేవర హృదయం.

ఓ యాదగిరిరెడ్డీ! నువ్వు కమ్మనాటి రెడ్ల కళా కౌశల్యము కలవాడవు. పాకనాటి రెడ్ల ప్రభావము సము

పార్జించుకున్నవాడవు. పెనుగొండ కొండరాయల నాటి రెడ్ల ప్రతాపము పుణికి పుచ్చుకున్నావు. తెలుగునాటి మోటాడ రెడ్డి పోటుతనంతో శక్తివంతుడవు. నువ్వు భూమంచిరెడ్డివి, నువ్వు తెలగా వీరుడవు, నువ్వు వెలమ నాయకుడవు. నువ్వు చెన్నప్పరెడ్డివి, బంగారపు కడ్డీవి.

ఆ మేఘంలోంచి ప్రత్యక్షమయాడు యాదగిరిరెడ్డి. ఆ భూమి మీాద నిల్చినాడు. ఆతని ఎడమచేత మేడితోక, కుడిచేత ఆ తెల్లటి గిత్తలను తోలే ములుగోరు కఱ్ఱ. నాగేటి చాలు సాగిపోతూవుంది: ఆతని కంఠంలోంచి మధురశ్రీలు ఆకాశం నిర్మలాలు, అడవి మల్లెల పరిమళాలు పొదివిపుచ్చు కున్న జీవజాను తెలుగుపాట వెడలి నేలా, ఆ దిశలూ, ఆ ఆకాశం నిండిపోతున్నవి.

సాగించు నాగలి
సాగించు రెడ్డి
నేలంత ప్రవహించు
చాలుతో దుక్కితో

అని పాడుకుంటున్నాడు.

౪

యాదగిరిరెడ్డి శాతవాహనుల కాలం నుంచి యీా నాటి వరకు నాగలి దున్నుతూనే వున్నాడు. పరభూములను మంత్రించి బంగారు పండు పంటభూములను చేసినాడు. అవి

రాజనాలో, సన్నారులో, ముతక అక్కుల్లో, కృష్ణకాటుకాలో పాలాట్రగడాలో, తెల్లజొన్నలో, పసిడిపచ్చ జొన్నలో, కందులు - సెనగలు - పెసలు - మినుములో నువ్వులో, కుసుమలో ...

యాదగిరిరెడ్డి నాగలి అటు నందిపర్వతంనుంచి ఇటు తెలివాహో నది వరకు సాగుతూనే వుంది. భూమి దున్నే వాడు, పంటపండించేవాడు, పాటపాడేవాడు. బండ్లపై ధాన్యాలు యింటికి తెచ్చేవాడు. దేశంపై దోచుకునేందుకు వచ్చిన పాడుమూకల్ని కత్తికట్టి చీల్చి చండాడి నాశనం చేసేవాడు. రాజ్యాలు నిర్మించాడు. రాజ్యాలు యేలాడు. పాడురాజుల్ని నాశనం చేశాడు. మంచిరాజుల్ని తక్తుపై యెక్కించి కూరోచ్చి పెట్టాడు. ఆ నాడు రాజై కవులను సత్కరించాడు. దేవాలయాలు నిర్మాణం చేయించాడు. శిల్పాలు, చిత్రలేఖనాలు దేశం అంతా సౌభాగ్యం నింపాడు. పాటలు పాడాడు, పాడించాడు. బంగారాలు తెచ్చాడు. సువర్ణాలు వెదజల్లాడు.

ఈ నాడు యాదగిరిరెడ్డి తానే రాజ్యభారం వహించ డానికి సంకల్పించాడు. అతి తెలివైన వాళ్ళ కృత్రిమాలు అతనికి అడ్డా! దేశభక్తులమంటూ దేశద్రోహం చేసే పాడు జీవితాలతనికి ఆనకట్టలా! యాదగిరిరెడ్డి నాగలి గిత్తలను అదిలిస్తూ "సాగండె, గొప్పు లడ్డమా, రాళ్లు అడ్డమా, లోపల విషంపెట్టుకున్న మనసులు అడ్డమా-మనకి, సాగండె" అనే వాడు.

వానచే తడసిన ఆ బంగారుభూమి నాగేటిచాలుకు ఆనందంతో దారి యిస్తూ, గంధం అలదికొన్నట్లు సువాసన వెదజల్లుతోంది. యాదగిరిరెడ్డి యీ రోజు తెల్లటి ఆ దుక్కి గిత్తలను తోలుతూ నాగేటి చాలు సాగిస్తాడు. ఆతని నాగేటి చాలుకి దేశముఖులు అడ్డం కారు. ఆత వతందార్లకు వెరవడు. కవులు దార్లను చిన్న చిన్న గులక రాళ్ళలా పార వేస్తాడు. ఆ జమీ అంతా అతడే దున్నుతాడు. అతడు ఆకాశరైతుకూ భూమి రైతాంగనకూ పుట్టిన ఆంధ్ర వీరుడు.

౨

ఉదయం మొదలుపెట్టిన దుక్కి ఆ సాయంత్రం వరకు సాగుతూనే వుంది. ఆ భూమంతా భూమిదేవి పులకలు లా, తందానతాన పాటలు లా ఆకాశంలో చుక్కల నడకల లా నాగేటిచాలు లతో నిండిపోయింది. మధ్యాహ్నం చెల్లెలు గంపలో పట్టుకువచ్చిన జొన్నరొట్టె, పులుసూ, కూరా మెక్కినాడు యాదగిరిరెడ్డి. ఈ రాజ్యం తనదై ఈ భోజనం గోధుమరొట్టెలయి, ఘనపురం బియ్యం అన్నమై, రేపు ఉదయించదా అనుకున్నాడు యాదగిరిరెడ్డి. నాగలి విప్పి బుజాన వేసుకొని ఎద్దుల తోలుకుంటూ పాట పాడు కుంటూ దగ్గరవున్న తన గ్రామానికి దారితీశాడు ఆ యువకుడు.

"రామపాదం కొలుచుకొంటూ
సాగరమే వెలిసే నంటా
కొండా గుట్టా అడవీగట్రా
పండి పోసే బంగారుభూమంటా
నేల నాదీ, గాలి నాదీ
చాలు నడచిన వాలు నాదీ
కాలమే ఇకముందు
నాదే నోయ్ !
అడవి నాదీ పుడమి నాదీ
కడిమి పూలా పడుచు నాదీ
విడని ధైర్యం విజయం నాదే నోయ్"

అప్రయత్నంగా కాళ్లు నడుస్తాయి. అడ్డాలు తీరి నడక సాగిస్తున్నాడు. అరమూతలు పడిన అతని చూపుల్లో తెలంగాణ మంతా భరతదేశాన్నే ఉద్ధరించే పాడిపంటల దేశమై, మెరుముశక్తితో పరువులెత్తే పరిశ్రమల ఆశ్రమాలతోనిండి ఎదుట ప్రత్యక్షమైంది. ఆత డనుకొన్నాడు: ఈ నేలంతా ఒకనాడు అడవులతో నిండి ఋష్యాశ్రమాలతో విలసిల్లేదట. ఈ నాడు పోడిమి తేలే ప్రజలతో ఈ పరిశ్రమాగార ఆశ్రమాలతో నిండి వుండదా? యాదగిరిరెడ్డి చదువుకున్నాడు. అతని చేతిలో నాగలి మేడితోక మాయమై ఆ యింజను నాగలి నడిపే మరచక్రమై నిలిచింది, పది ఎకరాలు సాగు సాగిన ఫలసాయం పదివేల ఎకరాలు ఫలించిన పంటై ప్రత్యక్షమైంది. అతని ఆ స్వప్నలోకంలో ఆతని

తమ్ముడు ఆ గ్రామాలన్నిటికీ మెరుము వెలుగుల దీపాలు ఉరుమునడకల శక్తులూ ప్రసాదించే యింజనీరై కనపడ్డాడు.

ఆతని తెలుగునాడు ప్రసరించి ప్రసరించి అటు తూర్పు తీరం చేరింది. ఇటు కన్నడిగ చెల్లెలిని కౌగలించింది. ఆ వైపు మహారాష్ట్రంతో నెయ్యమాడింది. ఈ వైపు అరవ మరదలితో సరసాలాడింది. గోదావరీ జలాలు - కృష్ణానదీ వళులలో సుళ్లుతిరిగి తుంగభద్ర కాలవలలో ప్రవహించాయి.

యాదగిరిరెడ్డి యింటికి చేరుకన్నాడు. అతని భార్య కంచుమెరుగు నవయౌవన సౌందర్యవతి. కోలమోమున మోదుగులు ప్రసరించిన బాలిక. కొండ తంగేటిమొగ్గ ముక్కు కలదై, కలిగట్టు చెట్టుపూవు గులాబిరంగు పెదవులు కలదై యెదురువచ్చి నాగలి దింపి వేన్నీళ్లు పోసుకోవడానికి రమ్మని నవ్వుతూ ఆహ్వానించింది. ఆమె తొడిగిన గద్వాల అంచుల రెవిక, ఆలేరు కెంపురంగుల చీర ఆమె సౌష్టవాంగపూరిత సౌందర్యానికి జోహారులన్నాయి. ఆమె మాట కూకురు గుడ్డంగిపిట్ట గొంతులోని తీపులు కలది.

నీళ్లు పోసుకుని వచ్చిన భర్తకు బతుకమ్మ జొన్నరొట్టి అన్నం వడ్డించి భోజనం పెట్టింది. బతుకమ్మ అచ్చంగా పొలం పడుచు. అన్నం వడ్డించే తన భార్య సొగసు చూస్తున్న యాదగిరిరెడ్డి మనసులో ఏవో మెరుములు మెరిసినవి. బతుకమ్మ తెలుగునాటి బంగారుదేవత. బతుకమ్మ పండగ కాబోలు ననుకున్నాడు యాదగిరిరెడ్డి. తెలంగాణపు రైతును

యెప్పుడూ యెవరో బాధిస్తూనే వున్నారు. ఆతడు తన బ్రతుకును రాజరికం చేసుకున్న రోజులు కాకతీయులతోనే వెళ్ళిపోయాయి. తురక ప్రభువులకు వంగి సలాము చేసినా ఆ నాటి యాదగిరిరెడ్డి ముక్కుపుటాలు విస్ఫారితం కావడం మానలేదు. ఆతని నడుం గూను కాలేదు. ఆ నాడు ఆతడు పండించిన పంటంతా, దొడ్లో కాసిన కాయగూర లన్నీ, ఆతని మేకలు, కోళ్లు, ఆతని ఆవులు, బర్రెలు వాటి పాలు దేశముఖుల, వతందారుల, కౌలుదార్ల, పటేలు పట్వారీ, పోలీసు ముంతజీముల వంట శాలలల్లోకి పోయినా ఆతడు మట్టి తినే జీవించాడో, ఆకు అలమూ ఆస్వాదించి బ్రతికాడో? శాతవాహనుల నాడు, చాళుక్యుల కాలంలో, కాకతీయుల దినాలల్లో తెలుగునాడు పొలాలల్లో పరిపూర్చుకున్న శరీర బలమూ, మనోబలమూ కరిగి కరిగీ, తరిగి తరిగి, మరిగి మరిగి నాశన మైనా మధ్యన వున్న చావైనా, చెక్కుచెదరకుండా నిల్చి వుండడం చేత తనవంటి యాదగిరిరెడ్లు, తన భార్య వంటి బతుకమ్మలు యీ నాటి విముక్తిలో సగర్వంగా నిల బడ గల్గారు.

తన దేశంలో వెట్టిచాకిరీ పోతుంది. తన భూమి తనది. జమీందార్లు, జాగీర్దార్లు హరించి పడమటిగాలిలో మాయమై పోతారు.

ఈ అందాల ప్రోగైన తన భార్య గర్భంలో స్వచ్ఛ స్వేచ్ఛావాతావరణంలో దివ్యగాంధర్వం ఆలాపించ గల్గే తన పుత్రుడు యింకో యాదగిరిరెడ్డి కదులుతూ వున్నాడు.

రాత్రి నిశ్వనాలు మాటుమణిగే కోకిల కంఠంలో, చెట్ల జేరే కొంగల అరుపుల్లో, జీబురాయల తాళగతులలో, ఊరిబయట నక్కల అరుపుల్లో, కుక్కల మొరుగుల్లో నిశ్శబ్దం ఆవరిస్తూవుంది.

సప్తమేఘాలు దిగివచ్చినట్లు భోరున కుంభవృష్టి కురుస్తూవుంది. దూరాన యాదగిరి కొండపైన లక్ష్మి నరసింహస్వామి "ఓయి తెలగు వీరుడా, బహుపరాక్" అని సింహగర్జన చేస్తున్నాడు.



# నరసన్న పాపాయి

రుద్రేశ్వరం గుడి యెదుట శివరాత్రి ఉత్సవంలో, గుడి లోకి రాబోయాడని మా అన్నయ్య ఆతన్ని చావ గొట్టాడు. మా అన్నయ్య ఆతన్ని చావగొట్టాడు!! మా అన్నయ్య ఆతన్ని చావగొట్టాడు!!!

నిజమే. ఆ బాలుడు హరిజనుడే! అంత మాత్రాన మా అన్నయ్య వాడిని చావగొట్టడమే! ఆ కుఱ్ఱవాడు చేసిన తప్పు? శివరాత్రినాడు రుద్రేశ్వరస్వామి గుడి లోకి మా అందరి తోటీ రావాలని ప్రయత్నించాడు.

మేము కోనేటిలో స్నానాలు చేసి, పట్టు బట్టలు కట్టు కొని, పళ్ళూ కొబ్బరికాయలూ పువ్వులూ ఆరతికర్పూరం ఊదువత్తులు మొదలయినవి పట్టుకు బయలుదేరాం. మా వూరుకు రుద్రేశ్వరం ఎనిమిదిమైళ్లు వుంటుంది. రాత్రి బళ్లు కట్టుకు బయలుదేరాం. తెల్లవారగట్లకు రుద్రేశ్వరం వచ్చాం. మా రెండెడ్ల బండే మాకు డేరా అయింది. దాని చుట్టూ తెరలు కట్టుకున్నాం. చాపలు కట్టాం. వంటలకు అన్ని సరంజామాలు మా అమ్మ చేసింది. ఆ తర్వాతనే తెలతెల్ల వారే సరికి కోనేరులో దిగాం.

ఆ బాలుడు మా వూరు పెద్దమాలపల్లిలో వుండే అబ్బాయి. వాళ్ళ అయ్య మా వూళ్ళో వున్న కరణంగారి పాలేరు.

మా అన్నయ్య వాడిని చావకొడుతూవుంటే వాడు పెట్టిన గోల రాతినైనా కరిగిస్తుంది. నేను వెక్కి-వెక్కి ఏడ్చాను. ఆ అబ్బాయి సొమ్మసిల్లి మూర్ఛపోయాడు. నేను ముందుకు పరుగెత్తి వాడిమీద నా చెంబులోవున్న నీళ్లు చల్లాను. వాడికి మెలకువ వచ్చి లేచి గుండె కరిగి పోయేటట్లు యేడుస్తూ తూలుతూ నడిచిపోయాడు.

నాకు నరసన్న ఏడుపు వినిపిస్తున్నది. స్వామికి అర్చన చేయించే పూజారి మంత్రాలు వాడి ఏడుపులా వున్నవి. గుడిలో మ్రోగించే గంటలు వాడు వెక్కి-వెక్కి రోదించి నట్లే వున్నవి. నేను అప్పుడు చిన్నబిడ్డనే అయినా నాకు నరసన్నను మా అన్నయ్య కొట్టడం నన్నే కొట్టినట్లయింది. నన్నుకూడా మా అన్నయ్య కొడ్తాడేమో అనిపించింది. నేనూ వెక్కి-వెక్కి ఏడ్చాను. నాకు ఎనిమిది సంవత్సరాలు ఈడు వుంటుంది.

'ఒసే రవణా! ఎందుకే యింకా ఏడుస్తున్నావు?' అని మా అమ్మ కొంచెం ఘాటుగా అడిగింది.

'దానిని రెండు వేస్తే వూరుకుంటుంది' అని మా అన్నయ్య. ఎంత కోపం! మా అన్నయ్యకు నేను వూరికే భయపడ్డానా? వచ్చిన వేలకొలది జనంలో తొక్కిసలాడుతూ బయటకు వచ్చాం.

నరసన్న ఏడుపు, జనకోలాహలం,డప్పులు,బూరాలు, 'శివశివశివోహం' అనే భక్తుల కేకలు నా నిశ్శబ్దబాష్పాలు, మా అన్నయ్య నన్ను తిట్టడం, మా అమ్మ నన్ను కేకలు వెయ్యడం: నరసన్న ఏడుపు: ఏడుపు! మా అన్నయ్య వాణ్ణి గుళ్లోకి వస్తున్నాడని చావగొట్టాడు.

నరసన్న పెద్దవాడయ్యాడు, నేనూ పెద్దదాన్నయ్యాను. నాకూ పెళ్ళయింది, నరసన్నకూ పెళ్ళయింది.

రుద్రేశ్వరం గుడి యెదుట మా అన్నయ్య శివరాత్రి ఉత్సవంలో వాడ్ని గుడిలోకి రాబోయాడని అతన్ని చావ గొట్టాడు. అది నా పెళ్ళి లోనూ నాకు జ్ఞాపకమే! వాడికి పెళ్ళి అవుతోందంటేనూ నాకు జ్ఞాపకమే!

నరసన్న మా అత్తవారికి పెద్దపాలేరయ్యాడు. ఆ వూరికి పెద్దమాల అయ్యాడు. కాని గుడి యెదుట వాణ్ణి మా అన్నయ్య కొట్టితే వాడు ఏడ్చిన ఏడుపే నాకు స్నేహితు రాలయింది. అదే నాకూ నరసన్నకూ మధ్య ఏదో విచిత్ర మైన పవిత్రమైన సంబంధం ఏర్పాటుచేసింది.

మా అన్నయ్య అతన్ని కొట్టిన సంగతి నేను మరచిపో లేదు. మా అన్నయ్యే మరచిపోయాడు. ఆ కొట్టడం చూస్తూ వున్న మా అమ్మా వాళ్ళూ మరచిపోయారు. ఆఖరుకు నరసన్నే మరిచిపోయాడు.

'ఏమయ్యా నరసన్నా! నీ భార్య కడుపుతో వుందట!'

'అవునండి ఖామందుగారూ !' అన్న అతని మొగం పూవులా వికసించింది.

నరసన్న ఒడ్డూ పొడుగూ అయ్యాడు. నరసన్న నల్లని రాయిచెక్కిన విగ్రహంలా మూర్తితాల్చాడు.

నరసన్నకు చదువులేదు. కాని వాడు చెప్పిన సలహా తిమ్మరుసు సలహా !

నరసన్న మా పాలేరు అవడానికి నేనే కారకురాలిని. అతడు మా పాలేరయినందుకు మాకు కోటివిధాల లాభమే అయింది. ఆ వూళ్ళో (మా వూరు 'పాడు') మా పొలం లా పండే భూమేది ?

నరసన్న రుద్రేశ్వరం శివరాత్రి వుత్సవంలో గుడి లోకి వెళ్ళబోతోవుంటే మా అన్నయ్య అతన్ని చావ గొట్టాడు !

మాలలూ మాదిగలూ యెన్నిసారులు పెద్దకులాల వారిచే దెబ్బలు తినలేదు !

మాలలూ మాదిగలూ యెంతమంది క్రిష్టియన్ మతంలో చేరలేదు !

మాలలూ మాదిగలూ మాకు దూరంగా వుండాలి ! మేము అంటు అవుతాము. నరసన్న భార్యను యెవరూ చూడకుండా నా దగ్గరకు రమ్మనేదాన్ని, నా తల దువ్వమనే దాన్ని, రత్తాలు మొదట నవ్వేసింది. తర్వాత నా బ్రతి మాలడాలు, నా కోపడపడాలవల్లా భయపడుతూ ఒప్పుకొని

పుట్టిన ఈ పెళ్ళిళ్లు సత్యబద్ధమైనవా? భగవంతునికి యిష్ట మైనవా? లేకపోతే వివాహంలేని ప్రణయం పాపభూయిష్టమైన దనే మాట నిజమా? ఇంతవరకూ తాను ప్రేమ అనే దేమిటో యెరుగడు. ఏదో అలంకరించుకొని, పొంకాలు తిరిగివున్న దేహంలో వున్న యువతు లాతని హృదయం చెదరగొట్టే వారు. తనకు మోహావేశము కల్గిన మాట నిజమే. అంత మాత్రమే. నిజమైన ప్రేమకూ్కడా మోహావేశం వున్నది. ప్రణయంకూడా శారీర ప్రేమరహితమై అదోరకపు విచిత్ర మైన ఉత్కృష్ట ఆశయభావమన్నా తాను నమ్మడు. భగ వంతుని మీద ప్రేమా, దేశంమీద ప్రేమా కూడా దేహ సంబంధం కోరుతున్నాయే!

ఈ విచిత్ర సంఘటన గుంటూరులో పురవిశ్రాంతి భవనంలో జరిగింది. సీతారామయ్యగారికీ, వీరయ్యకూ, కామేశ్వరరావు హృదయం కీనీడగా, చూచాయగా గోచ రించింది. వాళ్లిద్దరూ భయపడిపోయారు. అప్పటినుంచీ ఒకరి నొకరు సంప్రదించుకోకపోయినా కామేశ్వరరావూ మీనాక్షీ, ఏకాంతంగా వుండకుండా వాళ్లు చూస్తూ వుండేవాళ్లు. వీరయ్యకు తాను చెయ్యవలసిన దేమిటో తోచలేదు.

పులిమీద పుట్ర అన్నట్లు కొందరు ధనవంతులు, ఒకరిద్దరు జమిందారులు వ్యంగ్యపు మాటలతో మీనాక్షిని తమతో ఒకటిరెండు రాత్రిళ్ళుగానీ ఇంకా యెక్కువగా గాని గడిపేటట్లు చేస్తే పదివేల దాకా కూడ బహుమతు లిస్తా మని

కబుర్లు పంపించారు. వీరయ్య మండిపోయాడు. లోలోన క్రుంగిపోయాడు. ఈ సంగతి కామేశ్వర్రావుకు తెలియదు.

వీరయ్య సీతారామయ్యగారితో ఆ విషయం మనవి చేసుకున్నాడు. ఆయన తెల్లపోయినాడు.

సీతా—ఈ ప్రపంచకములో యిదో పెద్ద దురన్యాయమోయి! ఏ ఉత్కృష్టవిద్య నేర్చుకున్నా దెయ్యం నీడలా వెంటపడుతూ వుంటుంది ఈ దురదృష్టము. నాటకాల్లో వేషాలు వేసేవాళ్ళు, సంగీత పాటకులు గొప్పవాళ్లయిళ్ళల్లో వున్న స్త్రీల మోహబాణాలకు గురా? ఆడవాళ్లు వస్తే మగవాళ్లు శుంఠలై పోవడమా? ఛీ! ఛీ!!

వీర—ఏమిటండి, ఇప్పు డుపాయం? నాకు మతి పోతోంది.

సీతా—నావల్లే యీ చిక్కు వచ్చిందని అనుకుంటానోయ్!

వీర—మాకులంలో వాణ్ణి యిట్టాంటప్పుడు మా అమ్మిణ్ణి పెళ్లిచేసుకుంటండా సామీ!

సీతా—అదీ నిజమేనోయ్!

విఠలుడు—మీరు మా అమ్మిణితో కదిలేస్తురూ సామీ. మాకు దాని దగ్గిరికి వెళ్లడమే భయంగా వుండది.

౧౧

కామేశ్వర్రావు జట్టునంతా చెన్నపట్టణం తీసుకెళ్లినాడు. అది 1925 వ సం. డిశెంబరు నెల. అడయారులో దివ్యజ్ఞాన సమాజముయొక్క షష్టిపూర్తి మహోత్సవము అఖండ వైభవంతో జరుగుతూ వున్నది. దేశదేశాలనుంచి సభికులు ప్రతినిధులుగా వచ్చారు. వేలకువేలు సామాజికులూ, కాని వాళ్లూ కూడా ఉత్సవాలు చూచి ఆనందించడానికి వస్తూ వున్నారు. ఒకవైపు మహామఱ్ఱి వృక్షంక్రింద సభలు. ఒకవైపు చిత్రకళాప్రదర్శనం. ఇంకోచోట బౌద్ధ, పారశీక, క్రైస్తవ, జైన, మహమ్మదీయ, యూధ, హిందూమతాదుల ప్రార్థనలు. అఖండకోలాహలంగా వున్నది.

డాక్టరు జేమ్సు. హెచ్. కజిన్సు పండితుడు భారతీయ కళా వైభవ సముద్రములో మునిగి ఆనందపారవశ్యుడై పోతూ వుంటాడు. భారతీయ కళాద్భుతానికి దూరంగా వున్న భారతీయ మహాశయులకున్ను, ఇతర దేశీయులకున్ను ఆ కళలలో వున్న ఉత్కృష్టత వెల్లడించడానికి సంకల్పించుకొన్నాడా మహానుభావుడు.

ఆయన ఆ ఉత్సవాలకు జావా నుంచి ఒక తోలు బొమ్మలవాళ్ల జట్టు, వీధినాటకంవాళ్ల జట్టు రప్పించి ప్రదర్శనాలు యిప్పించాడు. ఆ ప్రదర్శనాలన్నీ కామేశ్వర్రావు మీనాక్షీవాళ్లతోపాటు పరికించినాడు, ఆశ్చర్యపూరితుడైనాడు, ఆతని భావాలు ఆకాశవీధుల పరువులెత్తినవి.

ఆ మరునాడు కామేశ్వర్రావు కొందరు స్నేహితుల సహాయంతో కజిన్సుగారిని కలుసుకున్నాడు.

కామే—జావా తోలుబొమ్మలాట చూచానండి. ఆ ఆట ఆంధ్ర దేశం నించే వెళ్లిందని నా ఊహ.

కజిన్సు—కావచ్చును. ఈ రెండు దేశాల ప్రదర్శనాలకు చాలా సంబంధం వున్నమాట నిజమే.

కామే—ఈ ఆటలో నాటకం, నాట్యం, సంగీతం, చిత్రలేఖనము, కవిత్వము, భాష మొదలైన కళలన్నీ దివ్యంగా కలిసి వున్నాయండి.

కజిన్సు—జావా ఆటలో కొన్ని దోషాలు వచ్చాయి. ఆంధ్ర దేశంలోని ఆటను కొన్ని దోషాలు ఆవరించినాయి. కళ రానురాను హీనస్థితికి వచ్చింది.

కామే—మానవునిలో వున్న పశుత్వం (Atavism) ప్రతి వ్యక్తిజీవితం లోను ఒకసారి పైకివచ్చునట్లుగానే ఒక సంఘజీవితంలోకూడా అప్పుడప్పుడు వస్తుంది గాదండి.

కజిన్సు—నువ్వు సరిగా చెప్పావయ్యా! ప్రేక్షకలోకం యొక్క హృదయస్థితిని బట్టి ప్రదర్శనం రీతిన్నీ మారుతూ వుంటుంది. సంఘకళారసజ్ఞత అధోలోకంలోకి పడిపోతూ వున్నప్పుడు ఆ పతనాన్ని ఆపుచేసి నిలబెట్టే బాధ్యత ప్రభుత్వంపైనా, కళాస్రష్టలపైనా, జమీందారులపైనా, ధనికులపైనా వున్నది.

కామే—అవునండి. ఈ తోలుబొమ్మల్లోని ఉత్కృష్టత మరిచిపోయి, ఉత్తములు విముఖులవడంచేత పాటక

జనుల కోసం గంధోళిగాడు, కేతిగాడు, అల్లాటప్పగాడు తెర మీద విజృంభించారు. కాని జాగ్రత్తగా చూస్తే పెద్దపెద్ద పాత్రలకు గంభీరమైన అభినయం, చిన్నపాత్రలకు వాటికి తగిన నటన మాచిత్రంగా వుంటుందండి. రామచంద్రుడు చెయ్యి మాత్రం కదుపుతాడు. లక్ష్మణుడు తలకూడా తిప్పుతాడు. ఆంజనేయులు మొదలైనవాళ్లు దేహమంతా కదుపుతూ అభినయం చేస్తారు. రాక్షసులు గడబిడ దడబిడగా బల్లల చప్పుడు, బూరాల మోతలతో నీడల్లా వచ్చి రూపం పొంది, మళ్లీ పొగలా అయి మాయమవుతారు. తమ రాశీర్వాదిస్తే ఉదయశంకరుడు నాట్యకళను పునరుద్ధరించి నట్లున్నూ, రవీంద్రుడు నాటకకళకు కొత్తపద్ధతిగ తిరిగి జీవం పోసినట్లున్నూ, ఈ తోలుబొమ్మలాట కూడా మార్చి ఉత్తమ హృదయులు మెచ్చుకునేటట్లు చేద్దామని వుందండి.

కజిన్సు—మీ భావం, ఆశయం చాలా బావున్నాయి. నాకు చేతనయినంత సహాయం చేస్తాను.

౧౨

భారతీయ సంప్రదాయమైన చిత్రలేఖనము నేర్చుకుని ప్రసిద్ధికెక్కిన ఒక ఆంధ్ర చిత్రకారకుని కామేశ్వరరావు చేరదీసాడు.

వీరయ్యతో, విఠలుడితో చాలారోజులు తర్జభర్జన చేశాడు. తోలుబొమ్మలాట విద్యలో తాను గొప్ప మార్పులు

తీసుకొస్తాననీన్నీ, అందువల్ల లోకప్రఖ్యాతీన్నీ, మిక్కుటమగు ధనమున్నూ వీరయ్యకు చేకూరుతాయనీ కామేశ్వరావు వాళ్లకి నచ్చచెప్పాడు.

అప్పుచేసి ఒక అయిదువందల రూపాయలు తెచ్చాడు. అవి ఖర్చుపెట్టి పురాతన భారతీయ సంప్రదాయాలైన అజంతా, మొగలు, రాజపుత్రపద్ధతులలో జపాను, టిబెట్టు, పారశీక, పాశ్చాత్య సంప్రదాయాలు సమ్మిళితం చేసి, నూతనంగా వచ్చే "వ్యంజ" (Impressionism), "కోణ" (Cubism) మొదలైన రీతులను యిముడ్చుకుంటూ, కొత్త రీతులు కల్పించుకుంటూ, ఉద్భవించిన నూతన భారతీయ చిత్రలేఖన సంప్రదాయ ప్రకారంగా రామాయణ భారత కథలకు, భాగవతంలోని శ్రీకృష్ణునికథకూ, సంధ్యాతాండవం మొదలైన శివగాథలకూ సరిపడే చిత్రాలు వీరయ్య చేత, ఆ ఆంధ్ర చిత్రకారకుని సలహాతో తయారు చేయించాడు.

ఉదయశంకరుడు తన నాట్యానికి ఉపయోగిస్తూ వున్న సంగీతపు హంగుపద్ధతిని కామేశ్వరుడు అవలంబించి గొట్టు, వీణ, వాయులీన (Violin), మహావాయులీన (Violincella), తంబూరా, చితారు, ఇస్రాజ్ మొదలైన వాద్య విశేషాల్ని వాయించే వాళ్ళను పోగుచేశాడు.

# ౧౩

ఈ నూతన సంప్రదాయపు తోలుబొమ్మలాటను మొదట అడయారులో డాక్టరు కజిన్సు మొదలగు సహృదయుల ప్రోల, ఓ రాత్రి ఎనిమిది గంటలకు ప్రారంభించి ఆడింపించాడు కామేశ్వర్రావు. ఆట పన్నెండు గంటలకు పూర్తి అయింది.

రంగంలో వుండవలసిన చిత్రాల మీదే వెలుగు పడుతుంది. ఉండనక్కరలేని బొమ్మలు తెరమీద లేవు. అభినయం, నృత్యం రసము వుట్టిపడుతున్నవి. సంభాషణ తెలుగులో చక్కని నుడికారంతో, తేనెలూరు తున్నది. హంగు చేసే సంగీతం విచిత్రము. ఉత్కృష్టపాత్రలు కర్ణాటక సంప్రదాయంగా నున్న, ఇతర పాత్రలు యేలపాటల పద్ధతిగా నున్న పాటలూ, పద్యాలు గానం చేసినారు, మహారాజు వస్తూ వున్నప్పుడు ఒక విధమైన సమ్మేళనగానం. మహాఋషి వస్తూ వున్నప్పుడు వినిపించిన సమ్మేళనగానం వేరు. మొదటిది ప్రాపంచికాద్భుతం సూచిస్తున్నది. రెండవది పారలౌకిక భావరసాలు వుట్టిపడ జేస్తున్నది.

అందరూ నిస్తబ్ధులై చూశారు.

మీనాక్షి యింతపెద్దకళ్లు చేసుకుని కథ అంతా గమనించింది. ఆమె పేరుపొందిన సంగీత విద్వాంసురాల నన్న భావంతో తాను జట్టులో పాలుపుచ్చుకోలేదు. కామేశ్వర్రావు అందుకని ఆమెను ప్రార్థించనూ లేదు.

తాను బొమ్మలరాణి. ఇంత చిన్నప్పుడు తాను గొంతుక మెత్తడం ప్రారంభించి నప్పటి నుంచీన్నీ జట్టు వాళ్ళూ, పల్లెటూళ్ళలో యితర్లూ తన్ను యెంతో ఆదరించే వాళ్లు. తాతగారికీ, తండ్రికీ గారాబు బిడ్డ. ఆలాంటి తన హృదయానికి తన రాజ్యానికి మించిపోయిన మహారాజ్యం ఓటి ప్రత్యక్షమైంది. ఆమె మనస్సు ఓ విధమైన వాంఛా మేఘంలో అలుముకుపోయింది. అన్నీ సుళ్లు చుట్టిపోయే ఆలోచనలే. అంతలో భయం.

తాను సంగీతంలో సేలం గోదావరి లా, బెంగుళూరి నాగరత్నం లా పేరు సంపాదించుకోవచ్చును. అది ఆఖరు కాదు కదా యీవాళ నుంచి? కామేశ్వర్రావు మళ్ళీ తోలు బొమ్మలాట మొదలుపెట్టించాడేమి? ఎంతబాగున్నా తోలు బొమ్మలాట మళ్ళీ వద్దు.

ఆమెకు గాడిద లద్దెలవాసనా, ఏళ్ళతరబడి చెమటలో తడి ఆరిపోయిన, భయంకరమైన ఛండాలపు మురికిగుడ్డల వాసన మళ్ళీకొట్టినవి. ఒళ్లు జలదరించింది. కళ్ళనీళ్లు తిరిగినవి. ఆ నరకంలోంచి రక్షించిన దైవసమానులు సీతారామయ్యగారు, కామేశ్వర్రావుగారు. వాళ్లు మళ్ళీ అధోలోకం లోకి తన్ను తోసివెయ్యరు కదా! అమ్మయ్యో !!

ప్రదర్శనం అయిన మర్నాటినుంచి కామేశ్వర్రావును చూడ్డానికి ఆమెకు భయం వేసింది. ఒకనాడు కామేశ్వర్రావు ఆమె దగ్గరకు వచ్చాడు.

ఆమె మంచంపైన మెత్తని దిండులోకి మొహందూర్చి తల యెత్తకుండా పడుకుంది. కామేశ్వర్రావు గదితలుపు చేర వేశాడు. ఆ బాలిక దేహసౌభాగ్యకాంతులు, ఆనందరేఖల వంపులుపోతూ, ఆ సన్నని తెల్లపట్టుచీరలోంచి ప్రతిఫలిస్తు న్నవి. ఆమె యౌవనము పూర్ణత దాల్చి ఆమె సౌందర్యానికి యింకా వన్నె తెచ్చింది. కామేశ్వరుని హృదయము వెర్రి ఆశ లో మునిగింది. ప్రేమపూర్ణతచే ఆతడు తూలుతూ పోయి మంచం పై పడుకునివున్న మీనాక్షిపై సుందరేశ్వరునిలా వాలాడు. ఆమెను తన బాహువుల్లోకి మింగివేసుకొన్నాడు. ఆమె కర్కశత్వము దాల్చి ఆతని బాహువుల్లో కట్టె వలె బిగుసుకొని పోయింది.

కామేశ్వర్రావు ఆశ్చర్యపడి

"మీనా! నే నంటే నీ కాపేక్ష లేదా?" అన్నాడు.

"..................."

"ఈ మూడేళ్ళనించి నా హృదయంలో ఒక దేవా లయం కట్టుకుని అందులో నిన్ను పెట్టి పూజ చేస్తున్నాను. ఆ రోజున మా ఊళ్ళో బొమ్మలాటలో నీ గొంతుక విన్నప్పటినుంచీ..."

కామేశ్వర్రావు తన కౌగిలింత లోంచి ఆమెను వదలి ప్రక్కను కూర్చున్నాడు.

"ఆనందంలేని నా జన్మకు ఆనందం యిచ్చావు, మీనా! నీ ప్రేమ అనే అమృతంతో నన్ను దివ్యుణ్ణి చేశావు."

మీనాక్షి లేచి కూర్చుంది.

"ఈ కొత్త బొమ్మలాట లోకి నన్ను దింపుతారా యేవిటి నాయుడుగారు?"

"మీనూ, మీనూ! నా కుటుంబం యావత్తూ వదిలి వేశా. నా తల్లినీ, వాళ్ళనూ చూసి యేడాదయింది. నీ దాసానదాసుణ్ణి. నా ఈ జన్మ భయంకరమైన వట్టి ఎడారిని చేసినా, పరమ పవిత్రాలైన హిమాలయభూములు చేసినా నీ చేతిలోనే వుంది."

కామేశ్వర్రావు మంచము దిగి ఆమె పాదాల కడ మోకరిల్లి ఆమె వళ్ళో తలపెట్టుకుని ఆమె నడుంచుట్టూ తన రెండు చేతులూ చుట్టి "నా జన్మం పవిత్రం చేసిన దేవిని ఉద్భవించుకున్న నాకు కృపావరము దొరకదా?" అని అన్నాడు.

మీనాక్షి దృగంచలాల నుండి వేడి చుక్కలు కామేశ్వర్రావు తలపై పడ్డాయి.

"మీరు అద్భుతమైనటువంటి నూతన ప్రపంచం లోకి తీసుకువచ్చినారు నన్ను. గడ్డిపోచను దవనపుమొక్కగా చేశారు. నా చర్మం మీ కాళ్ళకు జోళ్లు కుట్టి యిచ్చినా నా బాకీ తీర్చుకోలేను."

"ఒట్టి బాకీయేనా?"

కామేశ్వర్రావు చటుక్కున లేచి ఆమె బుజాల మీద తన రెండు చేతులూ వేసి ఆమె వేపుకు దీనంగా చూస్తూ ప్రశ్నించాడు. ఇంతలో తలుపు తోసుకొని వీరయ్య, కామే

శ్వర్రావు మేనమామ సీతారామయ్యగారు లోపలికి వచ్చారు. కామేశ్వర్రావు నిర్ఘాంతపోయాడు. మేనమామ అతి కోప కంఠంతో "యేవిరా, కాముడూ! చదువు కున్నందుకు యిదేనా యేంటి? కులం తగలేస్తున్నావు. కుటుంబం తగలేస్తున్నావు. మా అప్ప కుళ్లికుళ్లి మంచం పట్టింది. మేం పదిమందిలో తలయెత్తుకుని తిరగలేకుండా వున్నాం. అప్పులు చేసేసి తమ్ముణ్ణీ నిన్నూకూడా తగలేసుకుంటున్నావ్. నీ కొచ్చిన సమ్మంధాల వాళ్ళకి జవాబులు చెప్పలేకుండా సచ్చిపోతున్నాం. అనంతపురం డిప్యూటీకలక్టరుగారు పిల్లనిస్తామని నాతోకూడావచ్చారు. ఆయన పెద్ద హోటలులో వున్నారు. రా, అక్కడికిపోదాం. నీ మాటాముల్లీ సద్దుకో. మనం భీంవారం వెళ్ళిపోదాం లెగు."

సీతా——నాయనా! వీరయ్యా తన గొడవ తను చూసుకుంటాడు. ఆతనిపై దయ వుంచి ఇహ ఒదిలెయ్యమంటున్నాడు. నీ ధర్మం నువ్వు ఆలోచించుకో.

వీర——కామేశ్వర్రావుబాబుగారూ! మీరు మాకు చేసిన ఉపకారానికి మేం యెన్ని జన్మలెత్తి మీకు సేవజేసినా కృతజ్ఞత తీర్చుకోలేమండి, మా తమ్ముడి కూతురు కొడుక్కి సామీ మా అమ్మణ్ణిని యివ్వడానికి సమ్మందం యేర్పాటు చేసినా, మేం అంతా ఒరంగలెడుతుండము.

కామేశ్వర్రావు తుపాకుల యెదుట సింహంలా చుట్టూ తేరిపార చూశాడు. మాట జవాబు చెప్పకుండా అతి కోప

స్వరూపంతో మూడు అంగల్లో గుమ్మం దాటి విసవిస వెడలి మాయమయ్యాడు.

## ౧౪

ఆ నాటి సాయంత్రము మీనాక్షి మాయమయింది. రెండురోజు లైన వెనక బెంగుళూరులో మీనాక్షి, కామేశ్వరరావులకు వివాహం అయిందని పత్రికలలో ప్రచురణం అయింది. చెన్నపట్టణంలో బెంగలుపెట్టుకుని తిండి మానేసుకున్న వీరయ్య జట్టుకు సీతారామయ్యగారు నెమ్మదిగా ఈ వార్త వినిపించాడు. విఠలుడిమోము ప్రఫుల్లమైంది. వీరయ్య విషాదంతోనూ, కోపంతోనూ కూలబడిపోయాడు.

ఈ వార్త విని కామేశ్వరరావు మేనమామ మహాగ్రహంతో కామేశ్వరరావుని బండబూతులు తిట్టుకున్నాడు.

సీతారామయ్యగారూ, కామేశ్వరరావు మేనమామా భీమవరం తిరిగి వెళ్ళిపోయారు.

ఒక రోజు తెల్లవారేసరికి వికసించిన గులాబిపువ్వు మోముతో మీనాక్షీదేవి తాతగారి దగ్గఱకు వచ్చి నమస్కారం చేసింది. ఆమె పెదవులు చిరునవ్వు నవ్వుతున్నవి. ఆమెకళ్లు చిరుభయంతో బెదురుతున్నవి. ఆమె ఫాలంలో ముంగురులు చిరుగాలిలో చెదురుతున్నవి. ఆమె వాక్కులు చిరుకంపంతో తొణుకులాడినవి.

"నీ మొహం చూడకూడదు, అమ్మిణీ !"

"... ... ..."

'నువ్వెంత పాపం చేశావో నీకు తెలుస్తుందా?''

''… … …''

''నీకు పుట్టిన కొడుక్కి నా పేరు పెట్టుకోకు.''

''తాతయ్యా, నీకు దణ్ణం పెడదామని అవతల నుంచుని వున్నారు. కామేశ్వర్రావుగారు ఒక దేవుడు.''

క్రొత్తపద్ధతిలో అద్భుతమైనటువంటి అజినచిత్రనాటక ప్రదర్శనం మ్యూజియమ్ నాటకప్రదర్శనశాలలో జరుగునని చెన్నపట్నంలోని పత్రికలన్నీ ప్రచురించాయి. ఆ ప్రదర్శనంలో బొమ్మలరాణి మీనాక్షీదేవికూడా పాలుగొంటుందనిన్నీ, ఇంత విచిత్రనుగు ప్రదర్శనం భరతదేశంలో యిదివరకు చూపింపబడలేదనిన్నీ, ఈ ప్రదర్శన సూత్రధారుడైన కామేశ్వర్రావుగారు చాలా అభినందింపబడ తగినవాడనిన్నీ మొదలైన సంగుతులతో, జట్టులో పాల్గొనే వాళ్ళ ఛాయాచిత్రాలతో పత్రికలు వ్యాసాలు ప్రకటించినవి. ప్రదర్శనము శ్రీ గవర్నరుగారి అధ్యక్షతను జరిగింది. చూచినవాళ్ళంతా సంతోషంతో విస్తుపోయినారు. పదకొండువందలరూపాయల టిక్కట్లమ్మబడినవి.

నాట్యకంలో వున్న అందం, సినిమా టాకీలో వున్న అందం, చిత్రకళాప్రదర్శనంలో వున్న అందం కలవేసి యీ నవీనపద్ధతి రూపొందిందని పండితులు వ్యాసాలు వ్రాశారు.

ఓ నాడు ఉదయాన్న కామేశ్వర్రావు భార్యతో భీమవరంలో తన ఇంటి దగ్గర మోటారునుంచి దిగినాడు.

బెంగచే కృశించి తల్లి మంచముపట్టి వున్నది. ఇంతలో మెరుపుతీగలాంటి ఒక బాలిక ఆమె పాదాలకడ వ్రాలి, పాదాలపై తల వుంచి, పాదాలు పట్టుకున్నది. కామేశ్వ్రరావు తల్లి నెమ్మదిగా లేచి "యెవరమ్మా నువ్వూ?" అని ఆ బాలిక తలపట్టుకొని యెత్తి మోము తేరిపారచూచింది.

"నువ్వెవరు, తల్లీ?"

ఆ బాలిక కన్నుల జలజల బిందువులు రాలిపోతున్నవి.

"నువ్వు దేవతాకన్నెవు కాదుగదా?"

వర్షం కురుస్తూన్నపుడు వచ్చే వెన్నెలలా ఆ బాలిక పెదవులు నవ్వాయి.

కామేశ్వ్రరావు తల్లి "నా బంగారుతల్లి, నువ్వెవరో తెలియలేదు నాకు" అని ఆ బాలికని దగ్గరకు లాగుకొని హృదయానికి అదుముకున్నది.

ఇంతలో గుమ్మముకడ నిలుచునివున్న కామేశ్వ్రరావు

"అమ్మా! మీ ఆజ్ఞలేకుండా సంచరించిన ఈ అధ ముణ్ణి క్షమించి మా ఇద్దరిన్నీ దీవించవూ?" అన్నాడు.

ఆవిడకు హృదయం పొంగింది.

"నాయనా! ఈ దేవకన్నేనా నా కోడలు? బొమ్మలాట వాళ్ళ పిల్లంటే యానాదుల అమ్మాయి లా వుంటుం దనుకున్నాను. ఈమె శాపం చేత పుట్టిన ఇంద్రుడు కూతురు రా!"

కామేశ్వర్రావూ, మీనాక్షీ ఆమె పాదాలకడ మోకరిల్లారు. ఆ తల్లి కొడుకూ, కోడళ్ల తలల మీద రెండు చేతులూ వుంచి తలయెత్తి "శ్రీరాములూ, వీళ్ళిద్దర్నీ రక్షించు!" అన్నది.



# జగ్గన్న గంటం

అతడు వేద వేదాంగ పారంగతుడు. సకలశాస్త్ర విద్యావేత్త. నిరుపేద. పేరు జగ్గన్న. ఇంటిపేరు కడలివారు. కృష్ణానదీతీర శాలిభూములలో రెండు నివర్తాల నేల అతని పెద్ద కుటుంబానికి ఏ మాత్రం రాబడి నివ్వగలదు? జగ్గన్న తండ్రి రామన్న మంత్రికి ఆరుగురు ఆడపిల్లలు, ముగ్గురు మొగపిల్లవాండ్లు. •ముగ్గురు ఆడపిల్లలకు పెళ్ళిళ్లు చేసినారు. వారు అత్తవారి ఇళ్ళల్లో కాపురం చేస్తున్నారు. ఒక్కొక్క పెళ్ళికి ముప్పది నలువది కృష్ణరాయ వరహాల వరకు ఖర్చు అయినది. ఆ వరహాల రాబడికి ఒక్కొక్క నివర్తమే అమ్ముడు పోయింది.

రామన్న మంత్రి అతి అభిమాని. కూటికి జొన్నలు లేకపోయినా కుండ చల్లగా వుండవలసిందే. కుటుంబం యీావత్తూ అలా యెన్నిరోజులు వస్తుందో! కమ్మనాటి ఆరు వేల బ్రాహ్మణుడు. కొండపల్లి రెడ్డి ప్రభువుల రాజ్యం పాల సముద్రపు కెరటాలల్లా పరిపాలింపజేసిన జక్కన మంత్రి ముని మనుమడు.

కొండపల్లి రెడ్డి రాజ్యం శ్రీకృష్ణదేవరాయలు వడిసి బట్టి లోబర్చుకొన్నప్పుడు జక్కనమంత్రి రిక్తహస్తాలతో

స్వగ్రామమైన కడలీపుర క్షేత్రానికి విచ్చేసి తన మెడలోని హారాల నమ్ముకొని నూరు నివర్తములు భూమి కొని వ్యవసాయ దారుడయ్యాడు. భారతీయుడికి వాడి కత్తి అయినా దొరుకుతుంది. లేకపోతే నాగలి మేడి తోకైనా దొరుకుతుంది.

మూడు తరాల్లో నూరు నివర్తాల భూమి ఆరింటికి దిగింది. రాజభోగంపోయినా రాజసం మిగిలింది.

౨

కడలి జక్కన్న చదువుల కడలి. అతని వ్రాత ముత్యాల పోత. స్నానాది అనుష్ఠానాలు నిర్వర్తించుకుని ఉత్తరాన నాగేశ్వరస్వామి భక్తులు మోయించే గంటలతో శ్రుతికల్పి వాడి మొనవాలు గంటము చేత బూని ఏ భారతమో, భాస్కర రామాయణమో, శ్రీనాధ కాశీఖండమో, పెద్దనార్యుని మనుచరిత్రమో చక్కగా సమకూర్చిన తాళపత్రాల మీాద లిఖిస్తూ వుంటే అర్ధయామానికి ఆశ్వాసము పూర్తి అయ్యేది. అతని బంధువులలో ఒక కుటుంబానికి పూర్వీకుడు అయిన పేరంరాజు జక్కన కవి సిద్ధయామాత్యుని గురించి చెప్పినట్లు మన జక్కన్న గంటము వ్రాతలో సవ్యసాచి. రెండు చేతులా ముత్యాల మాలలు మహావేగంతో వ్రాయగలడు.

చిన్నతనాన్నించి అలవడిన ఈ విచిత్ర కౌశల్యమువల్ల జక్కన్న అప్పుడప్పుడు తండ్రిగారి పాదాలకడ పది పదిహేను

నిష్కములు సమర్పిస్తూ వుండేవాడు. ఏ మాండలిక ప్రభువో, ఏ ఉన్నత రాజోద్యోగో, ఏ సంపన్నుడో జక్కన్న వ్రాసి వుంచిన ఉత్తమ గ్రంథాలను తనకు తోచిన పారితోషికం అర్పించి తీసుకుపోతూ వుండేవాడు.

జక్కన తండ్రివలెనే పలచని పొడుగాటి మనిషి. బంగారు మేని ఛాయ. అమోఘమైన బలం పుంజింప జేసు కున్న ఉక్కులాంటి దేహము. గరుడ నాశికము. చిన్నవైనా అందమైన రేఖలు కలిగి కాంతివంతమైన కళ్లు.

తండ్రిగారి కడనే శుశ్రూష చేసి సంస్కృతంలో అఖండపాండిత్యము సంపాదించుకున్నాడు. తెలుగు భాషలో పూర్ణ పండితు డనిపించుకున్నాడు. కన్నడ, ద్రావిడాది ఇతర దక్షిణ భాషలలో, పారసీకం, ఓఢ్రం, హిందీ మొదలగు ఉత్త రాది భాషలలో ఉత్తీర్ణు డయ్యాడు. ఐదారు లిపులు మహా ప్రవాహం వలె రచింపగలడు.

జగ్గన తండ్రిగారితో పాటు వ్యవసాయం చేయుటలో ఆరితేరిన బంటు. తమకున్న రెండు నివర్తాల వ్యవసాయము త్వరలో ముగించి తండ్రి కుమారు లిద్దరు యితర భూములు కౌలుకు తీసుకుని వ్యవసాయం చేస్తూ వుండిరి. దాని వల్ల కుటుంబానికి ఓ మోస్తరుగా సరిపోయే రాబడి వస్తూ వుండెను.

# 3

తండ్రి—నాయనా! ఈ ఏటి పంట అంత నాశిగా లేదు బాబు.

జగ్గన—కందులు, సెనగలు, పెసలు, మిర్చి యింత పుష్కలంగా అవతరించడానికి కృష్ణవేణమ్మ దయే కారణం.

రామన్న మంత్రి—దేశంలో మళ్ళీ పెద్ద యుద్ధం సంభవించే సూచనలు కనబడుతూ వున్నవి. ఆంధ్ర సార్వభౌములు శ్రీరంగరాయలని, పెనుగొండలో రాక్షసుడైన జగ్గరాయలు హతమార్చి నప్పటి నుంచి మన మహారాజైన రఘునాధభూపాలుడు వుడుకెత్తిపోతున్నాడని వేగు వచ్చినట్లు దేవరకోటలో గగ్గోలుమంది. శ్రీమంతులు, ప్రభువులు నాగమనీడులం వారు ఏ సమయానకు రాణువుతో బయలు దేరి రమ్మని తంజావూరు నుంచి రఘునాధనాయనిం వారి ఆజ్ఞ వస్తుందో అని యెదురు చూస్తున్నారు.

జగ్గన్న—నాకూ హృదయంలో ఆందోళనంగావుంది. బాబయ్యగారూ! అధర్మం పరవళ్లు పెడుతూన్నది. ప్రభువు కృష్ణదేవరాయలు దివంగతుడయ్యాడు. దేశంలో భీభత్స దేవత తాండవం చేస్తూన్నది. దుర్గానాగేశ్వర దేవుని కృప యెల్లా వున్నదో.

రామ— శ్రీ దుర్గాదేవి కరుణ వల్ల నాలుగో అమ్మాయి భ్రమరాంబ వివాహం యీ ఏడు చేయవలసి వుంటుందిరా. కోటలో రాయస మయిన అడివి మాచన్నగారు

తన పెద్ద కుమారునికి భ్రమరాంబను యివ్వవలసిందని ప్రస్తావ రాయబారం పంపిద్దామని అనుకుంటున్నారని గొత్తివాడ పెద నాగేశ్వరరెడ్డి, రాజపురోహితుడు వేమూరి శ్రీరంగభొట్ల సోమయాజులువారును మొన్న సందేశం తీసుకొని వచ్చారు. అమ్మాయికి పదవ ఏడైనా పంచకావ్యాలు చదువుకుంది. అందాల బరిణె. దాని అదృష్టం యెట్లా వుందో.

జగ్గన్న—దేశపరిస్థితులు మేఘా లావరించినట్లున్నాయి బాబయ్యగారు. అవి రక్తమేఘాలు. రాజుల్లో రాజ్యకాంక్ష యెక్కువయింది. బలములు తక్కువయ్యాయి. బుడతగీచులు, వాళ్ళు యెక్కడ్నుంచి వస్తున్నారో. సముద్రాల అవతల నుంచో, సముద్రం క్రింద పాతాళం నుంచో, వర్తక మనీ, వల్లంకు లనీ, వచ్చి రాజులకూ రాజులకూ కొట్లాలు ముడి పెడుతున్నారు. ధర్మం లేదు, ప్రజల క్షేమం లేదు—ప్రభువుల హృదయాలల్లో.

రామన్న——ఒక్క మన నాగమనీడు ప్రభువు యార్లగడ్డ వంశానికే కాకుండా, కమ్మనాటి రెడ్ల వంశాలన్నిటికీ గూడా కీర్తి తెస్తున్నాడు. తన ప్రభువు రఘునాధ భూపాలునితో పాటు కావ్యకర్త అవుదా మని ఆలోచిస్తున్నాడు. పండితాదరణ, కళారాధన కలిగియుండడమే కాకుండా ప్రజలను తన బిడ్డల్లా రక్షించుకొంటున్నాడు. ఒక్క బందిపోటు యెరగం. రెండేళ్ల క్రింద వచ్చిన చిన్న తొామాన్ని భూమిలో మూడు నిలువులా పాతి, ప్రతియింటా దీపాలు వెలిగింపించి పండగలు చేయించిన ప్రభు వతడు.

౪

త్రం్రడికుమారు లిద్దరూ అనుకున్న మాటే నిజ మయింది. శ్రీమంతులు యార్లగడ్డ నాగమనీడు ప్రభువుకు తంజావూరు నుండి రఘునాధ మహారాజు మంత్రియయిన అప్పయ్య దీక్షితుల వారు అన్ని పరికరాలతోను, ఆయుధాల తోను, సంపూర్ణ సైన్యయుక్తంగా రావలసిందని మహారాజు ఆజ్ఞ పంపించారు. నాగమనీడు ప్రభువు తన స్నేహితుడైన కొండపల్లి అన్నారెడ్డి ప్రభువుకు, కొండవీటి చిన్నారెడ్డి ప్రభువునకును, తంజావూరికి సైన్యాలతో తరలివెళ్లడం విష యంలో రాయబారాలు పంపించారు.

దేవరకోటలో అలజడి యెక్కువగా వుంది. నాగమ నీడు ప్రభువు ఆజ్ఞ డిండిమాలతో, డప్పులతో రాణువ పోగు దల నాయకులు దేవరకోటరాజ్యం అంతా చాటింపించారు. ఊళ్లను పాలించే పంచాయితీలకు రాజముద్రాంకితమైన వార్తలు వచ్చాయి. రఘునాధభూపాల మహారాజు ఆజ్ఞ వెలనాడు, వేలనాడు, రేనాటి విషయం, కొండవీడు, కొండ పల్లి, కందనోలు, పాకనాడు మొదలయిన యావత్తు ఆంధ్ర భూమికి సంచలనం కలుగ జేసింది. కృష్ణదేవరాయని చల్లని రాజ్యం తలుచుకోనివారు లేరు. జగ్గారాయలు, మధుర ప్రభు వైన ముద్దు చెన్నప్పనాయుడు, ఆంధ్ర సామ్రాజ్యానికి తల పెట్టిన విపత్తును తలిచి కోపించి పళ్లు పటపట కొరకనివాడు లేడు.

నాగమనీడు ప్రభువు సైన్యాలలో వీరులైన దివిసీమ కాపువారు, యమునినైనా నిలబెట్టగల కమ్మనాటి రెడ్లు విరివిగా వచ్చి చేరుతున్నారు దేవరకోట మహాపురంలో కమ్మర కొలుముల్లో ఉక్కు కత్తులు, కరవాలాలు, భిండివాలాలు, బల్లాలు, శూలాలు, తోమరాలు రాత్రింబవళ్లు ఎడ తెరిపి లేకుండా. తయారవుతున్నాయి. మచిలీపట్టణంలో వర్తకం చేసుకొనే ఒలాందులు నాగమనీడు ప్రభువు పంపించిన బంగారపు టంకాలు తీసుకొని తుపాకులు, ఫిరంగులు, తుపాకిమందు, ఉక్కుసామగ్రి సరఫరా చేసినారు. ఏబది ఒలాందు సైనికులును ఒక చిన్న ఒలాందు నాయకుని శిక్షణ క్రింద వచ్చి నాగమనీని సైన్యంలో చేరారు.

నాగమనీడు ప్రభువుకు తన క్రింద దళవాయిగా వుండటాని కెవరి నేర్పాటు చేద్దామా అన్న ప్రశ్న ఉదయించింది. ప్రశ్నతో పాటే కడలి రామన్న మంత్రి మూర్తిన్నీ ఆయన కళ్ళ యెదుట ప్రత్యక్ష మయింది. రామన్న మంత్రి ముసలివాడైనా భీష్ముని వలె ఉద్ధత సత్వుడు. ద్రోణుని మరిపించే యుద్ధవ్యాపార నిపుణుడు. వెనుక బుడతకీచు దొంగలు (పోర్చుగీసు) కొందరు అరబ్బీ ఓడ దొంగలతో కూడి కృష్ణా నదీ ముఖద్వారంలో దిగి దేవరకోట సంస్థానం లోకి చొచ్చుకొని వచ్చి కడలి పురాన్ని ముట్టడించబోయే ముందర, రామన్న మంత్రి ఊళ్లోవున్న కమ్మనాటి రెడ్లవీరుల్నీ, కాపు వీరుల్నీ, అశ్వత్థామలా వీరత్వం వహించిన బ్రాహ్మణ వీరుల్నీ, చిన్నదళంగా నేర్పరచుకొని తమ కడ్డమొస్తుందని

ఏమాత్రం అనుకోకుండా, కొలదోపిడిలో రత్నాలరాసులు కలలుగంటూ ఏమరుపాటున నున్న ఆ బందిపోటు దండుపై హిమపాతంలా, రామబాణంలా, ఏనుగుల దండులా విరుచుకు పడ్డారు. బుడతగీచుల తుపాకులు ముక్కలయ్యాయి. అరబ్బుల సురియలు తునకలయ్యాయి. యేబదిమంది తోడి దొంగలు తమ ప్రాణాలు ఆంధ్రభూమి కర్పింపగా, తక్కినవారు పలా యన మంత్రము పఠించగా, రామన్నమంత్రి వెంటాడి, ఒక్క పురుగైనా లేకుండా బందిపోటు లందర్నీ మట్టిపాలు గావించాడు.

ఈ విషయం తలంపుకు రాగా నాగమనీడు ప్రభువు రామన్న మంత్రికి ఆహ్వానమూ, అందలమూ పంపించాడు. దేవరకోట కోటలోకివెళ్ళిన రామన్నమంత్రిని, రాయసం అడివి మాచన్నగారు సగౌరవంగా, సింహాసనాసీనుడై కొలువు తీర్చియున్న శ్రీమంతు నాగమనీడు ప్రభువులంవారి సభలో సముచిత ప్రవేశింప జేసెను. నాగమనీడు ప్రభువు లేచినాడు. సభికు లందరూ లేచినారు. నాగమనీడు రామన్న మంత్రికి నమస్కరించి ఆసనము చూపించి రామన్నమంత్రి ఆసీనుడు కాగానే, తాను సింహాసన మధివసించి "ఏమండీ! అయ్యావారూ! తమ యింటిలో అందరూ క్షేమంగా వున్నా రని తలుస్తాను" అని ప్రశ్నించినారు.

రామన్నమంత్రి:— శ్రీ నాగేశ్వరస్వామి కరుణవల్ల ప్రభువులవారి కటాక్షంవల్ల, అందరూ క్షేమంగా ఉన్నా మండి.

ప్రభువు:— రఘునాథరాయలు మహారాజులుంగారి ఆజ్ఞ ప్రకారం మేము సైన్యం తీసుకొని తంజావూరు వెళ్ళుతున్నాము. మా సైన్యం నడుపుతూ మాకు కుడిచేయిగా ఉండడానికి మీరు మాతో తంజావూరు రావాలని ఆశిస్తున్నాము.

రామ:- ఏలినవారి నమ్మకానికి కృతజ్ఞుణ్ణి. పంట పండించుకొనే యీ నిరుపేద పారుడు సైన్యాలు నడపడంలో తమకు ఏమాత్రం సహాయంగా ఉండలేడని నమ్ముతున్నాను.

అడవి మాచన్న మంత్రి:- రామన్నమంత్రిగారూ! కర్షకత్వంలో దక్షత చూపగలవాడే కదనరంగంలో గండర గండడై ముందుకు నడవగలడు. తమరు ఏలినవారు కాన్కనిచ్చే తాంబూలం పరిగ్రహించాలని మనవి చేస్తూన్నాను.

రామ:- నేను పెద్దవాడ్నయ్యాను. మాచన్న మంత్రి గారూ! నే నింటి దగ్గర కృష్ణా - రామా అంటూ నాగేశ్వరస్వామివారిని భజిస్తూ ఉండవలెను. మా పెద్ద అబ్బాయి యుద్ధంఅంటే చాలా కుతూహల పడుతున్నాడు. సహాయదళవాయిగా కాకపోయినా చిన్న చమూపతిగానన్నా తీసుకొని వెళ్ళవచ్చును. దళనాయకుడుగా ఉండడానికి నిజమయిన ప్రజ్ఞానిధి యతడే నని మనవి చేస్తున్నాను.

జగ్గన దళవాయిగా శుభముహూర్తంలో నాగమనీడులం వారి చేత అభిషేకింపబడ్డాడు. నాల్గువేల కాల్బలంతో నూటు ఆశ్వికదళంతో 10 ఏనుగులతో దేవరకోట సంస్థానాధిపతిన్నీ శ్రీమంతుడును అయిన నాగమనీడు

ప్రభువు, మల్లేపద్ది సింగమరెడ్డి, చలసాని అచ్యుతరామనీడు, కంఠంనేని వాసుకేశ్వరనీడు, వేములపల్లి దుర్గారాయలు, అరజా పిన్నమనాయకుడు, తలుపుల గంద్రయ్యనాయకుడు, గండు శోభనాద్రిరెడ్డి, నెరుసు బ్రహ్మన్ననాయకుడు, తోట భైరవన్న, మన్నీలుగ, చమూపతులుగ, అశ్వదళవాయిలుగ, గజయూధ నాయకులుగ కూడరా కడలిపురం వేంచేసినారు.

మంచి ముహూర్తం చూసి శ్రీమంతు నాగమనీడు ప్రభువు మహాక్షేత్రమయిన కడలిపురంలో వేంచేసియున్న కులదేవుడైన శ్రీ దుర్గానాగేశ్వరస్వామివారి కడకుపోయి బ్రహ్మవాసుకి, తక్షక, కర్కోటకాది పవిత్ర కృష్ణోదకాల కృతావగాహులై స్వామివారికి మహాన్యాసపూర్వకమైన యేకాదశ రుద్రాభిషేకములు చేయించినారు. సహస్ర నారికేళాభిషేకములు, బంగారుకలశాల కొలదీ పంచామృతాభిషేకాలు జరిగినవి. జ్యేష్ఠ శుద్ధ పంచమి గురువారంనాడు నాగమనీడు ప్రభువులు నాగేశ్వరస్వామివారి యెదుట విజయచిహ్నముగ అఖండమును వెలిగించి శుక్రవారం నాడు దుర్గామ్మవారికి సహస్రనామ కుంకుమార్చన చేసి శు॥ యేకాదశి బుధవారంనాడు సర్వసైన్యాలతో కదలి శివగంగలో వేంచేసియున్న కులదేవతయయిన మహిషాసురమర్దనిని సర్వదేవతలతోగూడ కొలిచి చక్రవర్తి వరాహలాంఛన పతాకము ఎత్తించి విజయ ఐరావతనామ మత్తగజముల నెక్కి తంజావూరు చేర వెడలినారు.

౫

తన సైన్యానికి తానే ముఖ్య సైన్యాధికారై నడుపు కుంటూ వెళ్ళిన నాగమనీడు ప్రభువుకి ముఖ్య దళవాయిగా జగ్గన్నమంత్రి ధనుస్సులు, యీటెలు, అమ్ములు, శూలాలు మొదలయిన ఆయుధాలతో ఒక మత్తగజాన్ని ఎక్కి నాగమ నీడు ప్రభుని కుడివైపున నడుస్తూ సైన్యాన్ని సర్వవిధాలా కనిపెట్టుచునూ తాను యిదే ప్రథమపర్యాయం చూసే దేశాన్ని గమనిస్తూ సైన్యాల్ని సింహాపురం దగ్గర పెన్న దాటించి భగవంతు నర్చించి తిరుపతి చేరుకొన్నారు. తిరు పతిలో నాగమనీడు ప్రభువు వెంకటేశ్వరస్వామివారి దర్శనం చేసి పూజలుచేయించి ముడుపులుచెల్లించి స్వామికడ శలవు దీసుకొని కతిపయ దినాల్లో తంజావూరు చేరుకొన్నారు.

జగ్గన్న హృదయం పరిపరివిధాల పోతున్నది. మను ష్యుల రక్తాలు ప్రవాహాలు కట్టడం, దేశాలు నాశనం అవ డం, మనుష్యులు నిర్మించుకొనే ఊహాపథాలు నాశనం గావడం - మనుష్యులలో దైవత్వమూ రాక్షసత్వమూఉంది కాబోలు. రాజ్యాలు వస్తున్నవి రాజ్యాలు పోతున్నవి. మహా రాజులు సింహాసనాలు ఎక్కారు. దేదీప్యమానంగా వెలి గారు. తెరవెనక మాయమయ్యారు. మతకర్తలు సకల శాస్త్రవేత్తలు, వేదాంతులు, మహాకవులు, సంగీత కళా నిధులు అందరూ వచ్చి తమ తమ విధులను నిర్వర్తిస్తూ అలా అలా నడిచి కాలంలో కలిసిపోయారు.

వీరి రాక గాని పోక గాని యీ అనంత విశ్వానికి అవసరమున్నదా అని జగ్గన్న అనుకొన్నాడు. కీర్తి ప్రతిష్ఠలు కొంతకాలం నిల్వవచ్చునుగాక యీ విశ్వవిశ్వాలలో కోట్ల కోట్ల అంశాంశమైన కీర్తిగాని ప్రతిష్ఠగాని తాను చేస్తున్నానని విర్రవీగే కర్మగాని యేమాత్రవి? రాజులచరిత్రలు దండకవులలో, అభ్యుదయి రచనలలో కవులచే గానం చేయబడుగాక. కవులయొక్క రసవత్తర ఘట్టాలు, తీయని లోతైన భావలలో రూపం పొందుగాక. ఈ విశ్వంలో వీని పరిణామము ఎటువంటిది? గంటము నడపడంలో తమకు సవ్యసాచిత్వం ఉండుగాక! తన గంటం వాడి మొననుంచి కావ్యరస ప్రవాహాలు సుడులు కట్టుకొని పోయినవి కాక! అవి తాటాకులలో ఉన్నవి. ప్రతిఅక్షరము క్షరము కానిదా? క్షరముకాని ఆ అక్షరాలను తన హృదయంలో మోసే తాళపత్రం దివ్యశక్తి స్వరూపమా?

ఈ లాంటి ఆలోచనలతో జగ్గన్న తంజావూరిలో తమ కేర్పరిచిన విడుదులలో బసచేసినారు. బృహదీశ్వరుని, బృహన్నాయకిని అర్చించినారు. భోజకృష్ణదేవరాయల అపరావతారమైన శ్రీ రఘునాథ రాయలమహారాజు కొలువులో ఆంధ్రసామ్రాజ్య మహోద్భుతము కన్నులార కనుగొన్నాడు.

గొప్ప వ్రాయసగాడైన జగ్గన్నమంత్రి, మహారాజు తనకోటలో నిర్మించిన సరస్వతీ మందిరానికి యాత్ర చేసినాడు. దారు దంత పేటికలలో సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాటక గ్రంథాలు వేలకొలదియున్నవి. పూర్వగ్రంథాలు,

ఆధునిక గ్రంథాలు అనేక రకాలయిన వ్రాతలలో తాటా కుల మీద విన్యాసమై ఉన్నవి. సరస్వతీమందిరము గ్రంథ రత్నభాండాగారమే గాదు, అనేక దివ్యత్వాలు సదా ప్రత్య క్షమై సభ తీర్చియున్న పావనభూమి యది. కర్కశులై రాక్షసత్వము వహించగల్గిన మనుష్యులు తమ దివ్యత్వం లోంచే గ్రంధాలు వ్రాయగల్గినారుగాబోలు! మనుష్యునిలో దివ్యత్వం ఏ ఆజ్ఞాచక్రంలోనో దాగి ఉంటుందా?

జగ్గన్నమంత్రి ఇంటి దగ్గర, పూజా పీఠంమీద వున్న తన గంటాన్ని తలుచుకొన్నాడు. తనకు గ్రంథాల్ని చూపి స్తూన్న గ్రంథాలయాధిపతిని "స్వామీ! శ్రీరఘునాథ భూపాలుడు రచించిన గ్రంధాలు ఒక్కసారి నాకు చూపించ గలరా?" అని ప్రశ్నించినాడు. "ఆ పెద్దపెట్టెలో వున్న దంతపు పేటికలో మహారాజు రచించిన రామాయణ గ్రంథ మున్నది. ఆ రజతపేటికలో నున్న పుస్తకము రఘునాథ మహారాజు కృతమైన వాల్మీకి చరిత్రము. ప్రభువులు ఇప్పుడు మహాభారత తాత్పర్యసంగ్రహము రచిస్తున్నారు. ఈ పెద్ద పెట్టెలోనున్న దంతపేటికలలోని గ్రంథాలన్నీ రఘునాథ ప్రభువుల వారికి అంకితము లిచ్చినవి. అది విజయవిలాసము. అది అలంకార రత్నాకరము. ఇది సాహిత్య రత్నాకరము. యజ్ఞనారాయణదీక్షిత మహాకవి రచించినది.

జగ్గన్న— "రామభద్రాంబికాదేవి అద్భుతమైన కావ్యాన్ని సృష్టిస్తున్నారని వినికిడి."

"రఘునాథాభ్యుదయ మను మహాకావ్యాన్ని ఆమె రచియిస్తున్నది. శ్లోకస్వరూపాన అమృతమే రూపెత్తిన రస వత్తర మయిన కావ్యం సుమాండి అది."

"ఔను, ఆమె యశము, కృష్ణాగోదావరీ తీరాలవరకు వ్యాపించింది."

## ౬

శ్రీ రఘునాథమహారాజు సైన్యాలు జైత్రయాత్ర సాగించి ఆషాఢ శుద్ధ పంచమినాడు తోపూరునందు ఆంధ్ర సామ్రాజ్యం విచ్ఛిన్నం చేయదల్చుకొన్న గొబ్బూరి జగ్గ రాయలతో తలపడి, షష్ఠినాడా తనిని యుద్ధంలో సబంధుకంగా సమయించినవి. మహాసైన్యం వ్యూహరచనయందు, యుద్ధము నందు అతిరథుడయిన రఘునాథరాయలు, ధర్మరాజు తన సహోదరుల సహాయం పొందినట్లు, నాగమనీడు, యాచమ నాయుడు మొదలయిన మహావీరుల సహాయముతో శత్రు సేనలను నుగ్గాడి విజయలక్ష్మికంఠమునందు పరిగ్రహణ పుష్ప మాల వైచినాడు.

ఆ యుద్ధంలో శ్రీమంతు నాగమనీడు ప్రభువున్ను, ఆతని దళవాయి జగ్గన్నమంత్రియున్ను చూపించిన పరాక్ర మము ప్రభువయిన రఘునాథరాయలు నిండు సభలో మెచ్చు కొన్నాడు. రఘునాథరాయని సచివులలో ఒకరయిన చెంగ ల్వాల ప్రకాశకవిమంత్రి (విజయరాఘవ నాయక వంశావళి కావ్యము రచించిన చెంగల్వాల కాళకవి దగ్గర జ్ఞాతి) జగ్గన్న

మంత్రి ప్రతిభకు, పాండిత్యానికి, సేనల్ని నడిపే బంటు తనంలో ఆతని ప్రజ్ఞకు యెంతో మెచ్చుకొని, నీలాంబుజ లోచనీదేవి లా వెలుగు తన పుత్రికను పత్నిగా స్వీకరించ వలసినదని నాగమనీని ప్రభువుద్వారా సందేశము పంపెను.

నాగమనీడు ప్రభువు రఘునాథ భూపాలుడు తనపై చూపిన ఆదరాభిమానాల కెంతో సంతోషించి 'సమరవ్యూహ నిర్వచన', 'పరగండ భైరవ' అను బిరుదాలను భక్తితో స్వీకరించి జగ్గన మంత్రికి తన ఆస్థానంలో మంత్రిత్వ పదవిని మహారాజు సమక్షంలోనే అర్పించినాడు. కడలి పురాన్నుండి రామన్నమంత్రి సకుటుంబముగ తంజావూరు వేంచేసినాడు.

జగ్గన్న మంత్రి వివాహం అతి వైభవంగా జరిగింది. ప్రభువుతో, బంధువులతో, భార్యతో, భార్య బంధువులతో జగ్గన్నమంత్రి దేవరకోట వచ్చి చేరినాడు. దేవరకోటలోను కడలిపురంలోను అనేక మహోత్సవాలు జరిగినవి.

వ్యవసాయం చేసుకుంటూ, కృష్ణవేణీ తీర ప్రదేశాల ఆనందంతో విహరిస్తూ, రాజకార్యాలు నిర్వర్తిస్తూ జగ్గన మంత్రి తన గంటాన్ని మళ్ళీ చేతపట్టినాడు. 'సత్యభామా విజయ'మను సంస్కృత కావ్యాన్ని, 'నాగమనీడు ప్రభు విజయ'మను తెలుగు కావ్యాన్ని ప్రారంభించి జగ్గన రెండు నెలలలో పూర్తిచేసి ప్రభువున కంకిత మిచ్చినాడు. అంకిత మహోత్సవము కోటలో అఖండంగా జరిగింది. రఘునాథ సరస్వతీమందిరము దర్శించిన నాగమనీడు ప్రభువు పెన్నిధి యైన జగ్గనమంత్రి తనకు బాసటగ నుండగా ఏమి కొదువ

యని దేవరకోటలోను సరస్వతీ మందిర మొకటి నిర్మించ దలచుకొన్నారు. జగ్గనమంత్రి గంటం లోంచి ప్రవహించి వచ్చిన పూర్వకవుల గ్రంథాలు రామన్నమంత్రి, జగ్గన్న మంత్రి శిష్యులైన యనేకులు వ్రాసియిచ్చిన తాళపత్ర గ్రంథాలు ఆ మందిరంలో వెలిగిపోయినవి. కృష్ణానది నవ్వుకొనుచు ఉత్తరవాహినియై ప్రవహించి సముద్రుని చేరుకొన్నది.



# దీపం సెమ్మె



ఆ రాగి సెమ్మె ఎన్ని శతాబ్దాల క్రితం చేశారో మా తాతయ్య కూడా చెప్పలేకపోయాడు. అయితే మాత్రం మా కుటుంబంలో ఆరు తరాల్నుంచీ దేవతార్చన పీఠం దగ్గిర ఆవు నెయ్యి వత్తులదీపం కాంతులు ఆనందంగా విరజిల్లుతూ వుండేది.

మా తాతయ్య చిన్నతనంలో నన్ను కాళ్ల వుయ్యాల వూగిస్తూ, 'వుయ్యాలా దంపాలా'. అని పాట పాడుతూ ఆ సెమ్మె కథ చెప్పాడు.

"చిట్టిగా అప్పుడే వయిందనుకున్నావు, మా తాతయ్య తాతయ్య తాతయ్య రామేశ్వరం నడిచి వెళ్తూ కుంభకోణంలో ఆగాడు."

"తాతయ్యా! కుంభకోణం మన చింతలదొడ్డి వెనకాలా? అక్కయ్య నువ్వు చెప్పావని చెప్పింది లే".

"కాదురా-ఇంకా దాని వెనక ఎంతో... ...దూరం. ఆ కుంభకోణంలో ఆయన సోమవారం వుదయమే కోనేరులో స్నానంచేసి, సంధ్యావందనం వార్చి, మడిబట్టలు, రాగి చెంబు, వుద్ధరిణెతో గోపురం దగ్గిరకు వెళ్లాడు."

"గోపురం అంటే - గుళ్ళో మనుషుల నెత్తిమీద పూజారి పెట్టడూ, అదా?"

"కాదురా నాన్నా! మనవూరి గుడికి ముందరగా ఇంకో గుళ్ళాగ ఎత్తుగా లేదూ; అది."

"అవును ఎన్నో బొమ్మలు చెక్కి వున్నాయి. మొన్న మొన్నసాయంత్రం అప్పు డెప్పుడో చిట్టచివరదాకా నే నెక్కితే-మీరంతా కంగారు బడ్డారు. అమ్మ ఏడ్చింది..."

"ఆరి నీ—-గేపకం వుందీ! విను అక్కడ ఒక ముస లమ్మ ఒక చిన్న పిల్లతో అడిలిపోతూవున్న చూపులతో యిటూఅటూ చూస్తూవుంది."

"ఆ చిన్నపిల్ల అందంగా వుందట. ఆవిడ మా తాతయ్య, తాతయ్య తాతయ్యని చూచి ఒణుకుతూ తెలు గుతో నాయనా మీ దేవూరు—మీరు తెలుగు వాళ్ళా" అని కంట నీరు పెట్టుకుంటూ వణుకుతూ అడిగిందట."

అన్ని చోట్లా తెలుగేగా!"

"కుంభకోణంలో అరవం మాట్లాడుతారులే. అందు కని వాళ్ళు అరవవాళ్ళు".

"ఆ ముసలమ్మ తెలుగావి డన్నమాటా తాతయ్యా! ఆ తరవాత చెప్పవూ?"

"మా తాతయ్య తాతయ్య తాతయ్య 'అవునమ్మా మాది గోదావరీతీరం' అని కులగోత్రాలన్నీ చెప్పాట్ట. ఆ ముసలావిడ ఘొలుఘొలున దుఃఖిస్తూ 'నాయనా! నా

కొడుకు యిక్కడ రెండేళ్ళ కిందట రెడ్డిప్రభువుల పనిమీద వచ్చాడు. భార్యాకూతుళ్లనుకూడా తీసుకువచ్చాడు. అప్పాటు నవాబుల కొలువులో రెండేళ్లు వుండి చిదంబరం మొదలైన క్షేత్రాలు సేవిస్తూ వచ్చాడు యీ వూరు. ఇక్కడ రెండు నెల్ల క్రితం జబ్బుచేసి నా కుమారుడూ, మహాపతివ్రత కోడలూ నన్నూ యీ కసుగాయనూ దిక్కులేని వాళ్లని చేసి వెళ్లిపోయారు' అందిట. ఆమె పట్టలేక ఏడుస్తోంటే నలుగురూ మూగారట. మా తాతయ్య తాతయ్య తాతయ్యకు కూడా కన్నీళ్లు తిరిగి, వాళ్లని కోవిల్లోకి తీసుకుపోయి ఓ మండపంలో కూచోమని, తానూ కూచుని, వాళ్ల పుట్టుపూర్వోత్తరాలు తెలుసు కున్నాడు.

కొడుకూ కోడలూ పోగానే రెడ్డి ప్రభువుల కా కబురంది ఆ ముసలమ్మకి కబురంపారట. ఆవిడ తక్షణం బయలు దేరి రామేశ్వరం వెళ్ళే జట్టును ఒకదాన్ని పట్టుకొని కుంభ కోణం చేరిందట. తల్లిదండ్రు లిద్దరూపోగానే ఆ పిల్ల అస్త మానం ఏడుస్తూ బెంగపెట్టుకు పోయిందట. పాపం ఆ వూళ్లో వున్న పెద్ద సంపన్న గృహస్థుడో అయ్యరు ఆ పిల్లను తన ఇంట్లో వుంచుకున్నా అరవంరాక బెంబేలెత్తిపోయిందట. వాళ్ల బామ్మ రాగానే ఒక్క ఉరుకురికి కౌగలించుకొని మూర్ఛ పోయిందట.''

''తాతయ్యా నాకూ ఏడుపు వస్తోంది''

మా॥ తాతయ్య తాతయ్య తాతయ్య వాళ్లని తీసుకొని మన వూరు తీసుకు వచ్చాడు. కులగోత్రాలన్నీ చూసుకుని

ఆ పిల్లని తన కొడుక్కి చేసుకున్నాడు. ఆ పిల్ల ఒక్కతే సంతానం గనక తండ్రి ఆస్తిఅంతా మా నాన్న తాతయ్య తాతయ్యకు వచ్చిందిరా బాబూ."

౨

మా తాతయ్య తాతయ్య తెచ్చిన ఆస్తిలోకల్లా ముఖ్యమైందే ఈ రాగి దీపం సెమ్మా. ఆ సెమ్మాతోనే వచ్చిం దాస్తి ఆవిడ తండ్రికి. గుంటూరు సీమనుంచి రెడ్ల ప్రభువుల రాయబారిగా వచ్చా డాయన ఆర్కాటు నవాబు దగ్గరకు. ఒక రోజున ఆయన ఆ వూళ్లో తిరుగుతూ వుండగా అంగడివీధిలో ఈ సెమ్మా అమ్మకానికి వచ్చింది. ఆ సెమ్మా కళకళలాడుతూ దివ్యంగా కనపడింది ఆయనకు. మాట్లాడకుండా అడిగినంత డబ్బిచ్చి కొనుక్కొచ్చి ఆయన దేవతార్చనంపెట్టె దగ్గిర పెట్టాట్ట.

ఆ సెమ్మా శిల్పం పని అతి అందంగాను, నాజూకుగాను, అద్భుతంగాను వుంది. కిందమట్టు కమలం, అందులోంచి కాంతి తీగలా కలశాలు, చక్రాలు, కమలాలు, తీగెలు, తామరకాయలా పైకెదిగి అష్టదళ పద్మములా సెమ్మా ప్రమిద తెలిసింది. ఆ ప్రమిద మధ్య నుంచి ఒక తీగ పైకి పోయింది. ఆ తీగె చివర ఒక హంస చాలా ఒయ్యారంగా నిలిచి వుంది. ఆ హంస మీద సంపూర్ణ ప్రఫుల్ల కమలం, దాని మీద పద్మాసనాసీన ఐన లక్ష్మి-సరస్వతీ, చతుర్విధ

పురుషార్థాలు, విజ్ఞానవీణ, తాళాలు, అష్టహస్తాలతో పట్టుకొని హాసవిలాసంగా వున్న వదనంతో వెలిసి వుంది

ఆ సెమ్మెలో ఆవు నెయ్యి గాని యింకోటి పోసేందుకే వీలులేదు. పమిడిపత్తి వత్తులు పెట్టి దీపం వెలిగిస్తే ఐశ్వర్యప్రదమైన వెలుగులు వెదజల్లుతూ, దేవతార్చనం పెట్టెలో వున్న దేవతల విగ్రహాలు ప్రాణశక్తులతో ప్రత్యక్షమయ్యేటట్లుగా వెలిగేది.

ఆ సెమ్మె దేవతార్చనంపెట్టె దగ్గరకు వచ్చినప్పటి నుంచి ఆ బ్రాహ్మణుడికి వచ్చిన తెలివి తేటలు అద్భుతం. రాజకీయంలోనే కాకుండా శాస్త్రాల్లో, కవిత్వంలో అన్నిటిలో ఉత్సాహం కలగడం వాటిలో మాంచి ప్రజ్ఞకూడా కలగడం ఆరంభించింది. నవాబుగారికి ఆయనంటే గాఢం అయిన ప్రేమ కలిగి నిక్షువుదోసిళ్లు యివ్వడం ప్రారంభించాడు.

అల్లా రెండేళ్ళు జరిగింది. కుంభకోణం వెడదామని ఆయన యిల్లాల్నీ కూతుర్నీ వెంటబెట్టుకొని దేవతార్చనం పెట్టె తీసికొని, బలువని ఆ రాగిసెమ్మె మాత్రం వదిలిపెట్టి బయలుదేరాట్టాయన.

అది బెడిసికొట్టింది కాబోల్ను. కుంభకోణం వెళ్లాడో లేదో భార్యభర్తలకిద్దరికి కొంచెం జ్వరం వచ్చి, సంధి పుట్టి కూతురికి జననీజనకుల్ని యెడబాపిపోయారు.

వారి కుమార్తెను మా తండ్రి తాతయ్య తాతయ్యకు యిచ్చి వివాహం చేసినప్పుడు వారి ఆస్తితోపాటు రాగానే మా యింట్లో దేవతార్చనం దగ్గిర వెలిగిపోవడం ప్రారం

భించింది ఆ సెమ్మా. అప్పటినుంచీ మా వాళ్ళంతా యే చదువు చదివినా అందులో సంపూర్ణ పాండిత్యం. ఏది పట్టినా బంగారం. మమ్మల్ని జమీందారులనే అంటారుగా !

ఆ సెమ్మా గృహం శుచి చేసి, ఇంటి ఆవిడ పూజల అరుగు అలికి, ముగ్గులు పెట్టి-దీపం పెట్టగానే ఆ లక్ష్మి సరస్వతీదేవి పక్కన నవ్వేదట. ఆ దీపంలో నెయ్యి అయి పోయే ముందు యెవరికో ఒకరికి తప్పక జ్ఞాపకం వచ్చే తీరే దట. రాత్రల్లా యెవరికో ఒకరికి మెలకువ వస్తోనే వుండేది. తెల్లవారగానే గాలివేసినట్లు ఆరిపోయేది. అందాకా గాలి వాన వీస్తున్నా కదిలేదన్నా కాదని చెప్తారు.

## 3

ఆ సెమ్మా పోయింది యిప్పుడు. అప్పణ్ణుంచి మా యింట్లో అన్నీ దురదృష్టాలే. ఎల్లా పోయిందో ?

మా తండ్రిగారు ఇంగ్లీషు పరీక్షల్లో బాగా పేసవు కుంటూ వచ్చారు. ఆయన జిల్లాజడ్జీపని చేస్తున్నారు ఇప్పుడు. ఆయన ఉద్యోగంలో ప్రవేసించిన కొన్నాళ్ళకే మా తాత గారు కాలధర్మం చేశారు. కోర్టుమునసబీ పని చేసినన్నాళ్లూ మా తండ్రిగారు యెవరో ఒక బ్రాహ్మణ్ణి దేవతార్చనం కోసం వుంచారు. సబుజడ్జీ అయింది, అప్పట్నుంచి ఆ పని పోయింది. ఒక జమీందారుగారి కుమార్తైనని మా అమ్మ దీపం పెట్టడం మానేసింది.

ఆ దేవతార్చనం పెట్టి నెమ్మదిగా మా స్వంత గ్రామంలో వుంచేసాం. ఇల్లా వుంటూవుండగా మా అమ్మకు జ్వరం ప్రారంభం; సంధిలోకి దింపింది. ఎంతమంది గొప్ప వైద్యులు ప్రయత్నాలు చేసినా మా అమ్మ మమ్మల్ని తీరని దుఃఖంలో ముంచి వెళ్ళిపోయింది.

ఆ తరువాత మా యింట్లో దొంగలు పడి పదివేల రూపాయల ఆస్థి దోచుకొని పోయినారు. మా చెల్లెలుకు కలరా వచ్చి మూడేళ్ల కిందట కాలం చేసింది. అప్పుడే జడ్జీ పని అయింది మా నాన్నగారికి.

నేను బాగా పరీక్షల్లో కృతార్థుణ్ణి అవుతో వుండేవాణ్ణి. అల్లాంటిది బి యె. పరీక్షకు వెళ్ళాలంటే జబ్బు. మూడేళ్లు ప్రయత్నం చేశాను కాని లాభం లేక పోయింది. నాకు ఎంతో ఏడుపువచ్చింది. మా నాన్నగారి దగ్గిరకి వెళ్ళాను.

"నాన్నగారూ యింక నేను చదువు మానేస్తా"

"పోనీలే! చదువు కేమి గాని మంచి బలంగా వుండే వాడివి నీకు కళ్ళు గుంటలుపడ్డాయి. బెంగా?"

"నాకు......ఏమీ తోచదండి. రెండుమూడుసార్లు ఆత్మహత్య చేసుకుందాం అని అనిపించింది."

"ఛా! వట్టి వెఱ్ఱివాడవులా వున్నావు. మొన్న డాక్టరు విశ్వనాధరావుగారు ఏమి చెప్పారు?"

"ఆయన నాతో ఏమీ చెప్పలేదు మీ తోనే మాట్లాడుతాను అన్నాడు."

మా నాన్నగారికి అక్కణ్ణుంచి నాకు మల్లేనే బెంగ పట్టుకుంది. ఆరునెలలు సెలవు పుచ్చుకున్నారు. మేం అంతా మా స్వంత గ్రామం వెళ్ళాం. గోదావరి తీరాన్న నేను రోజూ విశ్రాంతికి వెళ్తూ వుండే వాణ్ణి.

ఒకనాడు నేనూ మా నాన్నగారూ మా మేనమామా యింకా యింకా యితర చుట్టాలూ వూళ్ళో వుండే పెద్దలూ అందరూ మా మేడ మీద కూర్చుని తాంబూలాలు వేసుకుంటూ వున్నాము. ఆ సమయంలో మా నాన్నగారు చటుక్కున లేచి కిందికి దిగివెళ్ళారు. నాకు ఏమిటో భయం వేసింది. ఒళ్ళు పులకరించింది. కూడా మేడ దిగి నేనూ వెళ్ళాను. ఇద్దరం పడమటింటిలోనికి వెళ్ళాం. అక్కడ అలుకులు, ముగ్గులు లేకుండా పూజ అరుగుంది. మా నాన్నగారికి కళ్ళ నీళ్ళు వచ్చి దేవతార్చనంపెట్టెలు కలశాలు వున్న అలమారు తలుపు తాళం తీసి, తెరిచారు. అందులో ఏమిటో ప్రాణం లేనట్టే వుంది. అన్ని విగ్రహాలూ వున్నాయి.

''బాబాయి రాగిసెమ్మా యేది?''

''ఏ రాగిసెమ్మా?''

''కుంభకోణం రాగిసెమ్మా''

''అవునవునండి ఏదీ? అడగనాండి మావయ్యనిపిలిచి?'' ఎంతమందిని కనుక్కున్నా యెక్కడా లేదు.

అప్పణ్ణుంచి మా నాన్నగారు దీపం సెమ్మా కోసం లోకాలు తల్లక్రిందులు చేయడం మొదలు పెట్టారు.

౪

నాకు నాలుగైదు సంబంధాలు, ఆంధ్రదేశం లోకి గొప్పవి వచ్చాయి. ఒక సంబంధం మా నాన్నగారికి ప్రాణ స్నేహితుని కుమార్తె. ఆ అమ్మాయి చాలా అందంగా వుంటుందని అందరూ అంటారు. ఆమె బొమ్మచూసిన నేనూ అల్లాగే అనుకున్నా. ఆ అమ్మాయిని చూడ్డానికి నేనూ మా నాన్నగారు వెళ్ళాం గుంటూరు.

అప్పుడు విజయదశమి. గుంటూర్లో అందరూ కలశాలు పెట్టి నవరాత్రములు జరుపుతారు.

మా నాన్నగార్ని నన్నూ ఆ యింట్లో చేసిన గౌరవం యింతా అంతా కాదు. అప్పుడే పండగలకు రాబోయే అల్లుడు వచ్చాడా అన్నారట లోకులు.

వాళ్ళింట్లో పండగబొమ్మలు పెట్టారు. ఒక గది యిచ్చారు వాళ్ల అమ్మాయికి. ఒక్కతే కూతురు. ఆ అమ్మాయి తమ్ముడు నా దగ్గరకు వచ్చి అస్తమానం ఎగా దిగా చూడ్డం. ఆతని కళ్లు విశాలంగా బాగానే వున్నై; ఆతని అప్పగారి కళ్ళు.''

దశమిరోజున బొమ్మల గదిలో ఆ అమ్మాయిని చూడ్డానికి ఏర్పాటయింది. లోపలికి వెళ్ళా. మిల మిల లాడుతూ బంగారు బొమ్మలా నుంచుంది సిగ్గున వ్రా మోముతో ఆ అమ్మాయి. నాకు సిగ్గు వేసింది. నా గుండె కొట్టుకుంది. ఆ అమ్మాయి అందం వర్ణించడానికే వీలులేదు.

"ఆ అది ఏమిటి? అయితే సూర్యనారాయణరావు ఆ రాగిసెమ్మా ఎక్కడిదోయి?" అని అడిగాడు మెరిసిపోయే కళ్లతో మా నాన్న.

"చెన్నపట్టణంలో విక్టోరియా మందిరంలో కొన్నా"

"ఈ సెమ్మా మాది సుమా"

"ఆహా ఏలా వెళ్లిందక్కడకు ?"

అక్కణ్ణుంచి తంతివార్తల్తో విచారణ జరిపించ చివరకు ఒక పప్పు మిఠాయి అమ్మేవాడికి మా యింటి కాప కుర్రాడు అమ్మినట్టు. అది వాడు రాజమండ్రిలో కంచర దుకాణానికి అమ్మినట్టు, వాళ్ల దగ్గర ఒక గుమాస్తా కొ విక్టోరియా మందిరం వాళ్ల కమ్మినట్టు తేలింది.

ఆ సెమ్మా నా ప్రాణము, నా ఆత్మ లాగేసింది. ఒ అమ్మాయి మా యింటికి కాపురానికి వచ్చేటప్పుడు ఆ రాగి సెమ్మా పట్టుకొనే వచ్చింది.

మా తండ్రిగారు దేవతార్చన రోజూ చేస్తారు. నా ప్రియపత్ని, దీపం కాంతులు బంగారు మోమునకు అద్భుత మైన తేజం యివ్వగా, ఆ దీపం బమిడిపత్తి వత్తులతో రోజూ ఉదయాన్నే మడి గట్టుకొని వెలిగిస్తూ వుంటూంది.

